C.I

# మీరు కొత్తగా ఇల్లు కడుతున్నారా ?

# మీ పాత ఇంటిని ఆధునీకరిస్తున్నారా ?

# మీ కోసం ఆవిష్కరిస్తున్నాం సమగ్ర వంటగది.



మీ అభిరుచికి తగ్గట్టుగా మీ వంటగదిని అందంగా మలచుకునేందుకు అంతర్జాతీయ శ్రేణి మాడ్యులర్ కిచన్ సిస్టమ్స్‌ను ప్రవేశపెడుతోంది కుక్‌స్కేప్. సులభంగా, సత్వరంగా నెలకొల్పుకోగలిగిన కుక్‌స్కేప్ కిచన్ మీ గృహశోభను మరింత ఇనుమడింపజేస్తుంది.

★10 సంవత్సరాల వారంటీ ★జీవితకాలం విక్రయ అనంతర సేవలు

## మీకు మక్కువైన వంటగది ఎంపిక కోసం - విచ్చేయండి



పాలి యురేథిన్ వేసిన వుడ్‌తో మెరిసిపోయే కలర్స్‌తో తయారుచేయబడినది



కళాత్మక దృష్టిగల వారిని ఆకర్షించే అద్భుతరూపం



అందంగా డిజైన్ చేసిన టీక్‌వుడ్ సుందరరూపం



ఒరిజినల్ సాలిడ్ వుడ్‌తో అందమైన రంగులతో ఆకర్షణీయమైన రూపం



దృఢత్వానికి ప్రతీక, అందమైన రూపంతో అత్యంత ఆకర్షణీయం.




~ The Kitchen Gallery ~

## గాయత్రి ఎంటర్ ప్రైజెస్

3వ అంతస్తు J.M.-2, M&M షోరూం ప్రక్కన,
HDFC బ్యాంక్ ఎదురుగా, బందర్ రోడ్, విజయవాడ - 10
ఫోన్. 30[illegible]9644, సెల్. 98480 25060, 98481 99636

LpSA1017109

# చినుకు

## సాహిత్య మాసపత్రిక

సంపుటి - 1 ఆగష్టు 2005 సంచిక - 5

సంపాదకులు :
**నండూరి రాజగోపాల్**
సెల్ : 98481 32208

మేనేజర్ : లంకెజనార్ధన్
సెల్: 98485 36113

**చందా వివరాలు**

**సంవత్సర చందా - 100/-**
**జీవిత చందా - 1100/-**

రచనలు, చందాలు
పంపవలసిన చిరునామా :

'చినుకు' సాహిత్య మాసపత్రిక
27, 28. 3వ అంతస్థు, దత్తాస్ నయాబజార్,
రాజ్ యువరాజ్ థియేటర్స్ ఎదురుగా,
గాంధీనగర్, విజయవాడ - 520 003.

CHINUKU - SAHITYA MASA PATRIKA
FAX NO. 0866-2435370
E-mail : editor_chinuku@yahoo.com

డి.టి.పి. : కరుణా గ్రాఫిక్స్
Ph : 2435097, 9392101100



*Printed, Published & Owned by*
***Nanduri Raja Gopala Rao V.V.S.***
*and Printed at Vanaja Offset Printers*
*Vijayawada - 520 004.*

*Published at 27, 28. 3rd Floor, Datta's Naya Bazaar, Opp. Raj Yuvaraj Theatres, Gandhinagar, Vijayawada-3,*



## వర్షించిన చినుకులు



ముఖచిత్రకారుడు : అలెగ్జాండర్

# సంపాదకీయం



నండూరి రాజగోపాల్....

మనం ఒక గమ్మత్తయిన విషయం ఒకటి తెలుసుకోవాలి. ఇవాల్టిరోజున చాలామంది 'పిల్లలు పూర్తిగా టి.వి.కి, కంప్యూటర్‌కి, హోమ్ వర్క్‌లకి, పబ్లిక్ స్కూల్స్‌కి మాత్రమే పరిమిత మయిపోతున్నారు. వాళ్ళల్లో సృజనాత్మకత ఉండటములేదు' అంటున్నారు. కాని ఇది పూర్తిగా నిజంకాదు. 'చినుకు' తో విద్యార్థులు అను శీర్షిక గురించి చాలా కళాశాలలతోను, పాఠశాలలతోను సంప్రదించినపుడు ఆయా విద్యార్థులలో కలిగిన స్పందన, వాళ్ళు అంతకు ముందు రాసుకున్న వాక్యాలు (మీకు తెలుసా? వీటిని 'కవిత' అని గాని, 'కథ' అని అనడానికి వాళ్ళకి భయం. చెప్పడానికి వాళ్ళ పెద్దవాళ్ళకి భయం. ఎక్కడ చదువురాదో అని) మాకు చెప్పటం జరిగింది. ఎన్ని ఆలోచనలు, భావాలు, సృజనాత్మక వీచికలు ఆ అక్షరాలలో వీస్తున్నాయో...

'సాహిత్యం' కేవలం ఒకే స్థాయి మనుష్యులకి మాత్రమే పరిమిత మయిపోతుందేమో అన్న 'ఆందోళన' ఇదిగో ఇలా తగ్గుతోంది. ఏ విషయానికైనా 'అవుట్‌లెట్' చాలాముఖ్యం, 'వ్యక్తీకరణ' చాలా ప్రధానం. అలా వ్యక్తీకరించే భావాలు ఇవాళ కవితలుగా, కథలుగా వచ్చినా, భవిష్యత్‌లో ఈ భావిపౌరులకి అవే వ్యక్తిత్వాలుగా మారి మార్గదర్శకత్వం వహిస్తాయి. అప్పుడు సాహిత్యం భయపెట్టేదిగానో, బోరుకొట్టేదిగానో అవదు. జీవితంలో అదీ ఒక భాగమైపోతుంది. ఆ రోజుకు ప్రయాణిస్తున్న చినుకుకు మీ ఆదరాభిమానాలు కోరుకుంటూ....

# పత్రికోత్సాహం

జూలై సంచికలో రంగనాయకమ్మగారి వ్యాసం హృదయాన్ని తాకుతున్నట్లుగా, స్పందింపచేసేదిగా ఉంది. ఏదైనా పొరపాటు జరిగినపుడు ఎప్పటికైనా సరిదిద్దుకునే మంచి వ్యక్తిత్వం రంగనాయకమ్మ గారిలో కనపడింది. రావిశాస్త్రిగారి అభిమానులను క్షమించమనడం ఆవిడ సంస్కారాన్ని చాటుతోంది.

– కె.వి.యస్. వర్మ, హైదరాబాద్

'చినుకు' జూన్–జూలై సంచికలు చూశాను. సాహిత్య మాస పత్రిక క్రమంతప్పకుండా నడపటం చిన్న విషయం కాదు. మీ చిత్తశుద్ధికి అభినందనలు.

ఐతే – పత్రికను మరింత బాగా నడిపేందుకు కృషిచేయండి. విలువైన రచనలను ఉత్తమస్థాయి రచనలను ప్రచురించండి. ప్రముఖులు, ప్రతిభావంతులనుంచి రచనలు ఆహ్వానించండి.

చినుకు, చినుకు, మరింత పెరిగి పెద్దకావాలని కోరుతూ సాహితీజల్లులు కురవాలని ఆశిస్తూ....

–మానేపల్లి, యలమంచలి

జూలై 2005 'చినుకు' చూసేదాకా కునుకేలేదు. ఈసారి పత్రిక విడుదల చాలా జాప్యం అయింది. మీ ఇబ్బందులు మీవి మాలాంటివాళ్ళ ఆత్రుత మాదీ – 'చినుకు' పత్రిక చాలా చాలా బాగుంటోంది. రావిశాస్త్రి గురించి రంగనాయకమ్మగారి జ్ఞాపకాలు చదివాక 'చినుకు' లో రంగనాయకమ్మగారి కాలమ్ ఏమైనా మీరు నిర్వహించగలిగితే బాగుంటుందనిపించింది.

– వి.వి.డి.యస్. ప్రసాద్...విజయవాడ

మా చినుకుకు – తెలుగు సాహితీ మేరుపర్వతం రా.వి.శాస్త్రిగారిపై ప్రత్యేక సంచిక ప్రచురణ గొప్ప థాట్..!

చిన్న పత్రికలు పెద్దపనులు చేయగలవు చిత్తశుద్ధితో అని తెల్పారు. కంగ్రాట్స్..!

– పెరుగు రామకృష్ణ...నెల్లూరు

'చినుకు' అందుతోంది పత్రికతేవడం మాటలతో అయ్యేపనికాదు. అసాధ్యాన్ని సుసాధ్యంచేస్తూ వరుసగా పత్రికను తెస్తున్నారు. మీకు ప్రత్యేక అభినందనలు. చినుకు చినుకులాకాదు. సాహితీ చినుకై రాలుతుంది. కథల పట్ల కొద్దిగా జాగ్రత్త వహిస్తే ఇంకామంచి కథలోస్తాయి.

– పెద్దింటి అశోక్‌కుమార్...గంభీర్‌రావుపేట

చినుకు నాలుగవ సంచిక అందింది. విశాఖలో పదిసంవత్సరాలు... రా.వి.శాస్త్రి... కారా – చందు.. అత్తలూరి.. ప్రొ. వేణుగోపాలరావు... ఆకాశవాణి మధులతో గడిపిన అనుభూతులను, జ్ఞాపకాలను నెమరు వేసుకొనే అవకాశం కల్పించింది. మన 'చినుకు' ప్రతి చినుకు తన్మయాన్నే ఇచ్చింది.

– ఎ.బి. ఆనంద్...విజయవాడ

ఏ పత్రికనైనా ఈ రోజుల్లో ఎక్కువ కాలం నిర్వహించడం మాటలు కాదు అందులోనూ తెలుగు సాహిత్యానికి సంబంధించి చినుకు పేరుతో మిత్రుడు నండూరి రాజగోపాల్ తీసుకువస్తున్న పత్రిక అనేకమంది కవులకు భావప్రకటనకు వేదికగా కావాలని, భారతిలా సాహితీ సేవలో నిరంతరం కొనసాగాలని ఆశిస్తూ....

డా॥ తలతోటి పృథ్వీరాజ్, అనకాపల్లి

మృగసరి కార్తిలో తొలకరి వాన కోసం ఎలా చూస్తామో మన 'చినుకు' పత్రిక కోసం అంతగా నిరీక్షిస్తాం. "చినుకూ చినుకూ కలిస్తే వర్షం, ఈ చినుకు చదివితే పాఠకులకు ఎంతో సంతోషం" చినుకు వర్షమై పాఠకుల మనసుకు ఎంతో చల్లదనాన్ని ఇస్తుందని, ఇవ్వాలని ఆశిస్తున్నాం.

– ఎ. కమలా శ్రీదేవి, రాజమండ్రి

చినుకు పుస్తకం చాలా బాగుంది. పట్టి చదివించింది. మీకు అభినందనలు. నెలకోసారి వచ్చే స్వాతి చినుకు నేలపై పడగానే సాహిత్యపు చిగురాకు. అక్షరాలతో పాత్రల, అందాలపదాల అల్లికే సాహిత్యం. అక్షయ పాత్ర లాంటిది ఆనందం చిలికే దాని సాహిత్యం. శుభాశీస్సులతో...

– రాధిక, కాకినాడ

చినుకుతో పులకరించి భారతి మళ్ళీ జన్మించింది సాహిత్య ప్రస్థానంలో మీ కృషి ఓ యజ్ఞం... చరిత్రకి మణిదీపం...

– జనజ్వాల, వనపర్తి

రావిశాస్త్రి సంచికలో రంగనాయకమ్మ గారి జ్ఞాపకాలు రావిశాస్త్రి అంతరంగాన్ని ఆవిష్కరించాయి. చాసోగారి అభిప్రాయం ఆయన నిజాయితీకి, సాహితీ నిబద్ధతకీ అద్దం పట్టింది. అశోక్ కుమార్ గారి నిర్వహణలో మినీకవితల వేదిక ఆశాజనకంగా ఉంది. స్వార్థపరులు చరిత్రను వక్రీకరిస్తున్న సమయంలో జి.వి.పూర్ణచంద్ విశ్లేషిస్తున్న చారిత్రక సత్యాలు అవసరమనిపిస్తుంది. ఆచార్య పి. సత్యవతి గారి "మా భూమి" నాటక పరిచయం అభ్యుదయ సాహిత్య పతనం పట్ల ఆసక్తిని కలిగిస్తుంది. మరిన్ని మంచి సంచికలతో క్షణం క్షణం ప్రవర్థమానమై "చినుకు" తెలుగు సాహితీ ప్రియుల హృదయాలను సస్యశ్యామలం చేస్తుందని ఆకాంక్షిస్తున్నాము.

– రామసూరి, విజయనగరం.

చినుకు ఎంతో బాగుంటుంది. అత్యుత్తమ మైన విలువలతో విజ్ఞానాన్ని విరజిమ్ముతూ ఆనందాన్ని ఆరబోస్తూ... అలరిస్తోంది. గుండె గుండెను కలకండ లాంటి స్వచ్ఛమైన తెలుగుతో! అభినందనలు..!

– శారదాఅశోకవర్ధన్, సికింద్రాబాద్

"చినుకు" సంచిక చూశాను చాలా బాగుంది. శుభాకాంక్షలు. అన్ని రకాల సామాజిక విలువలతో వస్తున్న సాహిత్యం వైవిధ్యంతో కూడిన రచనలు ఇంకా రావాలని ఆశిస్తాను.

– అన్నవరం దేవేందర్, కరీంనగర్

## రంగనాయకమ్మగారి వ్యాసంలో....

జూలై సంచికలో 'గోరంతమాట సాయం – కొండంత మేలుచేస్తుంది'లో "పైగా పిల్లలని ఎప్పుడూ పంపొద్దు. పంపితే వాళ్ళ రైలు ఖర్చులు నేను పెట్టుకోవాలి" కు బదులుగా

"పిల్లలని నాదగ్గరకి ఎప్పుడూ పంపొద్దు. పంపితే వాళ్ళ రైలు ఖర్చులు నేను పెట్టుకోను. ఆ ఖర్చులు రెండువైపులా నువ్వేపెట్టుకోవాలి..." అని చదవాలి. గమనించగలరు.

– ఎడిటర్

# కలం యోధులు

## 'పులిపంజా'



అప్పలస్వామి పురిపండా
వ్యవహారిక భాష ఎజెండా
శ్రీరంగం శ్రీనివాసరావును
తొలుత ఎగరేసిన జెండా !

## పురిపండా అప్పలస్వామి

**1904 -1982**

పురిపండా అప్పలస్వామి వీర వ్యవహారిక భాషావాది. వాడుక భాషా ఉద్యమంలో గిడుగు వారసుడై ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వాడుక భాషకు ప్రవేశమూ ప్రతిష్ఠా కలగజేశారు. రామాయణ, భారత, భాగవతాల్ని వాడుక భాషలో రాశారు. తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఒరియా, బెంగాలీ సాహిత్యాలతో మంచి పరిచయం కలవారు. కొన్ని ఒరియా నవలలు తెలుగులోకి అనువదించారు.

పురిపండా అప్పలస్వామి కళా ప్రపూర్ణ. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి విశిష్ట సభ్యుడు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షుడు. అఖిల భారత రచయితల మహాసభ అధ్యక్షుడు (1963). జాతీయవాది. కాంగ్రెస్ పార్టీ సభ్యులు.గాంధీ స్ఫూర్తితో ఖాదీ విక్రయాన్ని చేపట్టారు. జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1948లో విశాఖపట్నం మునిసిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు.

శ్రీశ్రీ తొలికవిత్వాన్ని అంటే శ్రీరంగం శ్రీనివాసరావు కవిత్వాన్ని 'దివ్యలోచనములు' పేర తన 'స్వశక్తి' వార పత్రికలో అచ్చువేసి ప్రప్రథమంగా లోకం ముందు పెట్టారు. తను కార్యదర్శిగావున్న కవితాసమితి, తొలి ప్రచురణగా శ్రీశ్రీ 'ప్రభవ'(1928) కావ్యం అచ్చువేసి దానికి ఉపక్రమణిక రాశారు. ముద్దుకృష్ణతో కలసి 'యువర్ పబ్లిషింగ్ బ్యూరో' అనే సంస్థను స్థాపించి ప్రముఖుల వ్యాసాలు కరపత్రాలుగా వేసేవారు. విశాఖపట్నంలో పురిపండా ఏర్పాటు చేసిన తెలుగు కవుల ఫోటో ప్రదర్శన తెలుగు సాహిత్య చరిత్రలో ఓ అపురూపం.

1927లో 'మురళీ ధ్వని' (కవితల సంపుటి) వెలువడింది. సౌదామిని (పురిపండా తెలుగు కవితలకు శ్రీశ్రీ ఇంగ్లీషు అనువాదం)1947లో వెలువడింది. 1976లో పురిపండా కవితల సంపుటి 'పులిపంజా' పేరుతో(విదేశాంధ్ర ప్రచురణ/లండన్‌ప్రథమప్రచురణ)వెలువడింది.ఇది మంచి అభ్యుదయ కావ్యంగా, సామాజిక దౌర్జన్యాలపై పురిపండా విసిరిన పులిపంజాగావిమర్శకుల మన్నన పొందింది.

పురిపండా అప్పలస్వామి 1904, నవంబరు 13న విజయనగరం జిల్లా సాలూరులో పుట్టారు. 1982, నవంబరు 18న విశాఖపట్నంలో మరణించారు.

- అశోక్ కుమార్

# పురిపండా అప్పలస్వామి

## సుడిగాలి

పులిపంజా(1976) స్వీయకవితా సంపుటి నుండి..

తొలినాటి సంద్రాలు
తుహినగిరి శిఖరాలు
ఇంకి పోతున్నాయిలే
కుంగి పోతున్నాయిలే

తాత లేసిన పుంత
దైవ మేలిన సంత
పల్లేరు పాకిందిలే
జిల్లేడు మొలిచిందిలే

రాజు కట్టిన కోట
రాణి మెట్టిన తోట
భూతాలు గెంతాయిలే
బొమికలే నిండాయిలే

నల్లమందే కాని కళ్ళిప్పనంటావు
రాతిగుళ్లకె కాని రాను పొమ్మంటావు
సుడిగాలి రేగిందిరే !
పిడు గావులించిందిలే !

ఇది పురిపండా అప్పలస్వామిగారి శత జయంతి సంవత్సరం



శీర్షిక

# ప్రతిధ్వని

- కె.వి.ఎస్. వర్మ

## గొప్పోళ్ళూ గెడ్డాలూ

"అద్దాలనాడు బిడ్డ కానీ గెడ్డాలనాడా" అంది ఎర్రావు, " ఏంటే సెల్లీ సామెతలు సెబుతున్నావు" అంది తెల్లావు. "మన ఎదురింటి అప్పారావు నేదూ..." "ఎందుకు నేదూ. నిచ్చేపంగా పెళ్లి చేసుకుని ఉన్నాడు గందా" అంది తెల్లావు.

"ఆడు ఇయేల పొద్దున్న ఆళ్లమ్మను పెళ్లాం ముందర తీసిపారేసినాడు. దాంతో ఆయమ్మ కళ్లనీళ్లు పెట్టేసుకున్నాది. అది చూసేక ఆ సామెత గుర్తుకొచ్చినాది" అంది ఎర్రావు.

"ఈమనుసులు బలే సిత్రంగా ఉంటారే. ఒకప్పుడు ఎంతో పేమగా ఉన్నోళ్లే మరొకప్పుడు ఎంతో దుర్మార్గంగా ఉంటారు. మనమే నయం. అద్దాల నాడూ గెడ్డాల నాడూ ఒకేలా ఉంటాం" అంది నల్లావు నెమరేయడం ఆపి.

"గెడ్డాలంటే నాకు శానా ఇసయాలు గుర్తు కొస్తన్నయే ఓలప్పా" "ఏమిటి" అన్నట్టు తెల్లావూ నల్లావూ చూశాయి. 'మనమెప్పుడూ సోకులు చేసుకోం. ఎప్పుడన్నా సంక్రాంతికి అదీ పల్లెటూళ్లలో మనకు వనువు రాని గుడ్డలేసి. దణ్ణాలు పెడుతుంటారు. అదీ మనం కోరకుండానే ఈమణుసులు అట్టా చేస్తుంటారు..."

'ఇంతకీ ఈ సొదంతా ఎందుకు?' అంది నల్లావు చిరాగ్గా మొఖంపెట్టి...

నల్లోదినా, అసలే నీ రంగు నికార్సు. ఇలా ముకం ముటముటలాడిస్తే మరింత నల్లగా అయ్యి నీ వంక సూడబుద్దికాదు" అంది ఎర్రావు అసహనంగా. "అలవాటులో పొరబాటయిపోనాది. ఎర్రిమరదలు సెప్పేది బుద్దిగా ఇనాల", అనుకుని, 'సెప్పు మరదలా సెప్పు' అంది నల్లావు ఆసక్తిగా చూస్తున్నట్టు నటిస్తూ.

"అదిగో ఆ అరుగు మీద ఉన్నోడిని సూడు. ఎలా గెడ్డం గీసుకుంటన్నాడో. ఆడు రోజూ గెడ్డం గీసుకుంటాడు. పైగా గెడ్డం గీసుకునేటప్పుడు సిగరెట్టొకటి" అంది ఎర్రావు వెటకారంగా నవ్వుతూ. "ఆడు ఎలా ఏడిస్తే మనకేంటి" అంది నల్లావు. "అదే మరి నవ్వంటే ఒళ్లు మండిపోతాది. ఒకే ఈదిలో ఉన్నాక ఒకరి గురించి మరొకరు పట్టించుకోకుండా ఉంటారేటే ఓలప్పా" అని తెల్లావు మద్దతుకోసం చూసింది ఎర్రావు.

'సెల్లీ కరకట్టుగా సెప్పేవే...' అంది తెల్లావు ఎర్రావు వీపు మీద తన తోకతో చరుస్తూ. "పాపం, ఆయనగోరి పెళ్లానికి ఎంట్రుకలు గుచ్చుకుంటా



యనేమో ఆడు రోజూ గీసుకుంటాడు గెడ్డం...!! "ఒకేళ గెడ్డం నెరిసిందేమో, తెల్ల ఎంట్రుకలు కనిపించకుండా రోజూ గీత్తాడేమో..."

"గెడ్డం గురించి ఆరుద్ర గోరు ఏం అన్నాడో తెలుసునా " అంటూ ఎర్రావు చూసింది. "ఆయనెవడు" అన్నాయి. తెల్లావూ నల్లావూ. "మన ఇసాక పట్నమే ఆయన గోరింది. తర్వాత మద్రాసెల్లి సినీమా పాటలూ అవీ రాసేడు. కొండగాలి తిరిగినాది గుండె ఊసులాడినాది అనీ రాయినైనా కాకపోతిని రామపాదము సోకగా అనీ శానా పాటలు రాసేడు. ఎప్పుడూ ఇన్నేదా"

"ఇన్నామిన్నాం. ఆ పాటల ఆయన రాసేదని తెలీదు" అన్నాయి నల్లావూ తెల్లావూ.

"ఆరుద్రగోరు మహాకవి శ్రీశ్రీగోర్కి ఏమవుతాడో అదైనా తెలుసునా" "తెలీదు" అన్నట్టు ఎర్రావు వంక తెల్లావూ నల్లావూ చూశాయి. "మేనల్లుడవుతాడు. త్వమేవాహం, సినీవాలి వంటి కవితా పుస్తకాలు రాసేడు. తర్వాత కొన్నేళ్లకి వాళ్లిద్దరికీ పడలేదు. ఆ సమయంలో శ్రీశ్రీగోరిని మీ శిష్యరత్నం ఆరుద్రగోరి మీద మీ అభిప్రాయమేంటి అని ఎవరో అడిగారు. వప్పుడు ఆయన 'శిష్యుడు అంటే అతనొప్పుకోడు. రత్నమంటే నేనొప్పుకోను' అన్నాడు.

"ఇదంతా మా ఎర్రిమరదలు ఎందుకు సెబుతున్నట్టో అంది నల్లావు ఆగలేక,

"ఇనయం నేకుండా నానేదన్నా సెబుతానా ఓలప్పా"

"మా సెల్లి గురించి నాకు తెలీదా? నల్లమరదలు నువ్వేం సెబుతావోనని సూస్తున్నది. ఇనయం సెప్పెయ్యిమరి"

"పెతిరోజూ గీసుకోని గెడ్డం ఉంటుందా సరసానికి అడ్డం అని ఆయనగోరు ఓ పజ్జెం రాసేడు, అంటే గెడ్డానికి ఈ మనుసులు శానా ఇంపార్టెన్సు ఇత్తారన్నమాట. అంతెంతుకు గెడ్డం మీన పజ్జెం రాసిన ఆరుద్రగోరు కూడా గెడ్డం పెంచినాడు. గుబురు గెడ్డం, పిల్లిగెడ్డం... ఇలా శానా రకాలున్నాయి. ఏం నల్లొదినా సెప్పమంటావా...' అంది ఎర్రావు.

"సెప్పు ఎర్రి మరదలా సెప్పు. నీకిన్ని ఇనయాలు ఎట్టాతెలుసోనని ఎప్పటికప్పుడు అచ్చెర్యపోతుంటాను" అంది నల్లావు. "నువ్వు అందగత్తెవే కాదు, మంచిదానివి కూడా" అంది ఎర్రావు అభిమానంగా చూస్తూ.

" అదంతా నీ అభిమానం. గెడ్డాల గురించి సెప్పు మరదలా" అంది నల్లావు లోపల్లోపల బోలెడు ఆనందిస్తూ.

"మన పురాణ పురుషు లైన ఇశ్వామిత్రుడికీ వశిష్టుడికీ, బలరాముడికీ, భీష్ముడికీ గెడ్డాలున్నాయి. ఆళ్లు ఆలోచిస్తూ గెడ్డాలు చేతులతో దువ్వుకుంటుంటారు తమాషాగా. రష్యాలో ఇప్లవం తెచ్చిన మహానుభావుడు లెనిన్‌ది పిల్లి గెడ్డం. గర్జించురష్యా గాండ్రించు రష్యా అని రాసిన మహాకవి శ్రీశ్రీగోరు చనిపోయే ముందు పెంచింది కూడా పిల్లి గెడ్డమే. త్రిపురగోరు కూడా ఒకప్పుడు పిల్లిగెడ్డం పెంచినట్టు గుర్తు. ఇప్పుడున్నాదో నేదో..."

"ఆయనెవరే ఎర్రిమరదలా" "త్రిపురంగోరి గురించి తెలీదా. ఆయనదీ మన ఇశాకపట్నమే. బగవంతుని కోసం పాము, రాబందుల రెక్కలసప్పుడు వంటి కథలు కొన్నే అయినా మంచివి రాసినాడు. అది సరేకానీ. మన మాజీ పెదాని గుజ్రాల్‌కు కూడా పిల్లిగెడ్డం ఉన్నది. చైనాలో ఇప్లవం తెచ్చిన మావోకు రష్యాలో ఇప్లవం తెచ్చిన లెనిన్‌కూ వాళ్లకేకాక ఇంకా ఇప్పటికీ ఎందరికో దారి సూపిన తత్వవేత్త మార్క్సుకు కూడా పెద్ద గెడ్డమే ఉన్నది. తత్వవేత్తలు ప్లేటోకూ సోక్రటీస్‌కు, బ్రిటన్ నాటక రచయిత బెర్నాడ్‌షాకు పెపంచ పెక్యాత కథాశిల్పి టాల్‌స్టాయ్‌కూ పెద్దగెడ్డాలున్నాయి. ఇంక నోబెల్ బహుమతి గ్రహీత ఇస్వకవి రవీంద్రనాద్ ఠాగూర్‌కూ పెద్దగెడ్డమే ఉన్నది. ఆయన రాసిన గీతాంజలి కావ్యానికి నోబెల్ బహుమతి వచ్చినాది. ఆ గీతాంజలిని తెలుగులోకి అనువదించిన గొప్ప రచయిత చలంగోరికీ గెడ్డం ఉన్నాది. టాగూర్ అంటే మనదేశంలోనే కాదు, పోలెండ్‌లోనూ ఎందరో అభిమానులున్నారు. ఆయన రాసిన కథల్నీ నాటకాల్నీ అక్కడ అనువదించుకున్నారు. 1942లోనే ఓ టీచర్ జనుసుల్ కోరెజక్ టాగూర్ పోస్టాఫీస్ నాటకాన్ని అంధపిల్లతో వేసి నాజీల ఆగ్రహానికి గురయ్యాడు ఈ మధ్దిన టాగూర్‌గోరికి పోలెండ్‌వారు నివాళు లర్పించారు అంటే ఇప్పటికీ ఆయనంటే వాళ్లకు ఎంత గవురమో తెలుస్తున్నాది. గెడ్డాల సొగుసు గురించి నన్ను సెప్పమంటే టాగూర్ గెడ్డానికే మార్కులేస్తానని పెముక సంపాదకుడు నార్ల ఎంకటేశ్వర్రావు అప్పుడెప్పుడో అన్నాడు" అంటూ ఎర్రావు చెప్పుకుపోతూనే ఉంది. ★

# పచ్చికుండ




ఎవరో అపరిచితుడు
ఎదురుపడి
ఒక మృణ్మయ పాత్రను
చేతుల్లో పెట్టి
జాగ్రత్త చెప్పి మరీ వెళ్లిపోయాడు.

అప్పట్నుండీ
అవిశ్రాంతంగా
దానిని మోసుకు తిరుగుతూనే వున్నాను
చివరికి దానిని మోయడం
ఒక వ్యసనమై పోయింది.

మోయగా మోయగా
కొంతకాలానికి
అది నాలో ఒక భాగమైపోయింది.
ఒకటే మోత
బరువు తెలియని మోత
అలసట ఎరగని మోత
ఎంతకాలం మోసినా
అందులో ఏముందో
చూడాలని అనిపించకపోవడం విచిత్రం.

రక్తమూ కన్నీళ్లూ
చెమట వీర్యాలతో
నిరంతరం తడిసి నానిపోయిందేమో
వున్నట్టుండి
చివరికి
ఒకరోజు
చేతుల్లోనే పగిలిపోయింది.
ఇక యిప్పుడు చూడక తప్పలేదు.

ఇన్నాళ్లూ
దేహపు దొండపాదు
అల్లుకున్న పందిరిలా
నావే
అస్థికలు.

- శిఖామణి

# చినుకులు

- శిరంశెట్టి కాంతారావు



కృష్ణా పుష్కరాలకోసమని ఇరవై ఏండ్ల తరువాత మళ్ళీ జగ్గయ్యపేటలో అడుగు పెడుతున్న నా గుండె కనుమల్లో పుట్టిన ఉద్వేగపుజాలు అంతంతకూ విస్తృతమై ఉక్కిరి బిక్కిరి చెయ్య సాగింది...

నా ఆనందానికి స్పందించిన మేఘాలు 'చిట, వట' మంటూ కరిగించిన వెండి ముద్దల్ని వర్షిస్తుంటే... ఆ స్పర్శను ఆస్వాదిస్తూ... మెల్లగా ముక్త్యాల గమిడి వైపు కదిలాను....

ఆ... చిరుజల్లు కుంభవర్షమై ఈ ఇరవై ఏండ్లుగా విదేశీ ఎ.సి.ల కాలుష్యంతో పేరుకు పోయిన నా వంటిని పవిత్రీకరిస్తుంటే.. నల్లరేగడి మట్టిలా విచ్చిపోతూ ముక్త్యాల గమిడి చేరుకున్నాను.

'బండెడు చెడునైనా.. సహించే మనిషి, చిటికెడు మంచికి ద్రవించి పోతాడు. అన్నట్టు కురుస్తున్న వర్షానికి జనమంతా ఎక్కడెక్కడో తలదాచుకున్నట్టుంది. ఎవ్వరూ కన్పించడంలేదు! ఐతే... ఓ రెండు.. మూడు ఆటోలు మాత్రం ఆగిఉన్నాయి...

వర్షం మెల్ల, మెల్లగా వెలిసింది

అంతదాకా ఎక్కడెక్కడో తలదాచుకున్న జనమంతా రోడ్డు మీద కొచ్చేశారు !

ఆటోలు తూడ్చుకుంటు "మూతాల, మూతాల! ఏలాద్రి, ఏలాద్రీ !" అంటు అరవ సాగారు ఆటోడ్రైవర్లు అప్పటిదాకా ఆశగా ఎదురు చూసినా... కరీంమియా జట్కా కన్పించక పోవడంతో నిరాశగా వేదాద్రి వెళ్ళే ఆటోలో ఎక్కికూర్చున్నాను.

నేను ఎక్కిన అర్ధగంట తరువాత ఏడెనిమిది మంది ప్రయాణీకుల్ని పిడకల్ని పేర్చినట్టు పేర్చిన తరువాతగాని ఆటోను బయలు దేరదీయలేదా ఆటోవాలా..!

ఆటో బయలుదేరడమే ఆలస్యం "బొయ్" మంటూ ఒక్కసారిగా టేప్‌రికార్డర్ ఆన్ చేశాడా

ఆటోవాలా ! అసలే ఒకరి వళ్ళో ఒకరం కూర్చుని నానా చికాకు పడుతుంటే.. మధ్యలో ఈ టేప్‌రికార్డర్ గోలేంటి? అనుకున్న నేను "బాబూ ! ఆ టేప్‌కొంచెం ఆపేయ్" అన్నాను.

అంతే....!!?

ఆటోలో ఉన్న వాళ్ళంతా నన్నో వింత జంతువును చూసినట్టు చూస్తూ.... "హే! ఉందనియ్" అన్నారు. వాళ్ళ చూపులతోనే సగం చచ్చిపోయిన నేను, వాళ్ళ మాటలతో మరింత చచ్చిపోతూ "ఇదేంటి వీళ్ళు ! ? అనుకుంటూ కళ్ళు మూసుకుని గతంలోకి జారి పొయ్యాను.



"హేయ్ జట్కా అబ్బీ ! వేదాద్రికొస్తావా ?" అడిగాడు మామయ్య ఆగిఉన్న జట్కా వాలాను. "వస్తాను బాబూ ! ఎక్కండి" అన్నాడు జట్కావాలా. అప్పటిదాకా జట్కాబండిని చూడ్డమేగాని, ఎక్కడం వీలు పడని నేను హుషారుగా ఎక్కి కూర్చున్నాను. నాతర్వాత నాన్న, మామయ్యా ఎక్కింతర్వాత ఇనుపకమ్మీని అడ్డుపెట్టి జట్కా ఎక్కిన జట్కావాలా ఒక్కసారిగా గుఱ్ఱం పగ్గాల్ని గుంజి వదులుతూ... "ఛల్‌రే! బేటా ! ఛల్ !" అంటూ చర్నాకోలాను "ఛళ్" మనిపించి గుర్రున్ని అదిలించాడు.

అంతే....

అప్పటిదాకా నెమరు వేస్తూ నిల్చున్న గుర్రం ఒక్క సారిగా పరుగందుకుంది.

గుర్రండెక్కల చప్పుడుతో, కుదుపులతో జట్కా పరుగులు తీన్తుంటే.... నరదాగా అన్పిస్తుంటే ఆ జట్కావాలా వైపు పరిశీలనగా చూశాను. ముప్పైఐదు, ముప్పై ఏడుకు మధ్య ఉంటాడేమో నని పించింది. ఖాకీ నిక్కర్ మీద, నీరు కారి తెల్లబుషట్ వేసు కున్నాడు. మెడలో ఏదో తావీజ్ వెళ్ళాడుతుంది. తలమీద గుడ్డటోపీ పెట్టు కున్నాడు.

నాన్న, మామయ్యా ముక్త్యాల కోట గురించి, ముక్త్యాల రాజాగారి గొప్పతనం గురించి మాట్లాడుకుంటున్నారు.

నేను రోడ్డు మీద పోతున్న మనుషుల్ని, రోడ్డు పక్క ఉన్న ఇండ్లను చూస్తూ.. కూర్చున్నాను.

జట్కా ఊరుదాటి రెండు ఫర్లాంగులు ముందు కొచ్చింది. అక్కడ రోడ్డుకి కుడి వైపున పెద్ద, పెద్ద కాలుతున్న సున్నం బట్టీలు కన్పిస్తున్నాయి. ఆ.. సున్నం బట్టీలు దాటంగానే రోడ్డు మెరక రావడంతో జట్కా వేగం తగ్గింది. వెంటనే జట్కావాలా "అరే! రామూబేటా ! జల్దీ భాగోరే!" అంటూ చేతిలోని ఛర్నాకోలాను 'ఛళ్ళు' మనిపించాడు జట్కా జయంతిపురం రోడ్డు మలుపు తిరిగింది.

జట్కా వాలానే గమనిస్తున్ననేను "ఏంటీ..! మీ గుఱ్ఱంపేరు రాముడా !? "అంటూ అడిగాను.

'ఔను బాబూ ! ఈ... ఏటి వట్టిమ్మటి పదూళ్ళల్లో మా రామూబేటాను కొట్టినోడు లేదు." తన గుఱ్ఱం గొప్పతనం గురించి ఉత్సాహంగా చెప్పసాగాడు జట్కావాలా.

అతను చెప్పిందంతా విన్న తరువాత "ఔనూ... ఇంతకీ నీ పేరేమిటి?" అతనెవరో తెలుస్తూనే ఉన్నా అడిగాను.

"కరీంమియా బాబూ ! అంతా.. జట్కాకరీం అంటారు" చెప్పాడతను.

"మరి నువ్ జూస్తే నేమో సాయిబ్‌గారివి ! నీ గుఱ్ఱం పేరేమో !"

"దాందేముంది బాబూ! మా ఊరి ప్రెసిడెంట్ గారి పేరు మస్తాన్‌రెడ్డి. ఆళ్ళేమో కాపులు; కావాల్సింది మంచి తనం గాని, పేర్లదేముంది బాబూ ! ఏపేరైనా పెట్టు కోవచ్చు" చెబుతున్న అతని ముందు నాకు నేనే మరు గుజ్జులా కన్పిస్తుంటే.... ఏద్వలేక నవ్వుతూ "ఔనూ.. ఈ జట్కా మీద రోజుకెంత సంపాదిస్తావ్?'' అంటూ సంభాషణను వక్కదారి పట్టించాను.

"ఆ ! ఏం సంపాదనలే

**నెపోలియన్**

స్వేచ్ఛా సమానత్వం, సౌభ్రాతృత్వాల కోసం 1789 నుండి 1799 వరకు జరిగిన ప్రజా పోరాటమే "ఫ్రెంచి విప్లవం"గా పేరు పొందింది. ఈ పోరాటంలో తన పోరాట పటిమను ప్రదర్శించిన రణరంగ యోధుడు అయిన నెపోలియన్ ఆగష్టు 15, 1769వ సం॥లో జన్మించారు. ఫ్రెంచిలో 1799వ సం॥లో రాచరికపు వ్యవస్థ అంతం కాగానే నెపోలియన్ ఫ్రాన్స్ అధిపతి అయ్యారు.

బాబూ ! మేమాలు మగలం, నల్గురు పిల్లలు, మా; బాపు ఇంత మందిమి ఈ జట్కా మీదనే బతకాల. ఏదో ఆ.... ఏలాద్రి నర్సింసామి దయ. పొట్టకు, బట్టకు సావులేకుండ ఎల్లుది."

"తెలివైనవాడే ! నేనడిగిందానికి నమాధానం చెప్పకుండనే దాటవేశాడు" అనుకున్నా.

"ఇంతకూ మందేవూరు బాబూ!" అటువైవునుండి అడగడం మొదలైంది.

"భద్రాచలం"

"అబ్బా ! శానాదూరంనుంచొన్తుండ్రే! నర్సింసామి దర్శనానికా?"

"ఔను దేవుణ్ణి చూసుకొని గింజుపల్లి పోయిరావాలి"

"గింజుపల్లా !? ఎవలింటికి ?"

"నీకా ఊళ్ళో వాళ్ళంతాదెల్సా ?

"ఈ కిష్టమ్మటి పదూళ్లల్లో ఈ జట్కా కరీంకు తెలియనోళ్ళుంటారా !? అసలింతకూ మీ రెవలింటి కెలుతుండ్రు ?" చర్నాకోల కర్రను జట్కా చక్రానికి ఆనించి పెట్టడంతో "ట్రూ..ట్రూ.." మని వస్తున్న చప్పుడుతో గుఱ్ఱం హుషారెక్కి పరుగు పెంచుతుంటే అడిగాడు కరీంమియా....



ఆటో ఎందుకో ఆగిపోవడంతో ఆలోచనలు చెదిరి పోయి వాస్తవంలోకొచ్చాను.

ఉన్నవాళ్ళతోనే ఇరుకై ఛస్తున్నా పట్టించుకోని ఆటోవాలా ఇంకో ఇద్దరు ప్రయాణీకుల్ని ఇరికిస్తున్నాడు.

బయటికి చూశాను.

సరిగ్గా సున్నంబట్టీల దగ్గరకొచ్చాం. ఇప్పుడా రాళ్ళసున్నం వాడేనాధుడే లేక, పనిలేని సున్నం బట్టీలు శిథిలమై వాటి మీద జిల్లేడు పొదలు, సర్కార్ తుమ్మ చెట్లూ పెరిగిపోయి ఉన్నాయి.

ఎక్కడ జిల్లేళ్ళు మొలిచాయో... అక్కడ పడాగు పడ్డట్టే లెక్క... మనిషి ప్రాధాన్యతలు మారుతుంటే వాటితో పాటు అనేక మార్పులు సంభవించి కొన్ని ఉపయోగం లేకుండాపోతే కొన్ని కొత్తవి వచ్చి చేరుతాయి.

ఆటో తిరిగి బయలు దేరింది.

ఆలోచనలు తేనెటీగల్లా ముసురుకున్నాయి.



"వగడాల రామ నర్సయ్యగారింటికి"

"ఓహో వగడాలోల్లింటికా?!"

"ఆయన్నీకు తెల్సా ?" మా సంభాషణ వింటున్నాడేమో మామయ్య హఠాత్‌గా అడిగాడు.

"తెలియకేం ! ఆ ఊరికాయనే పెద్దరైతు. శానమంచోడు. ఇంటికెవలు బోయినా... అన్నందినకుండ బోనియ్యడు" కరీంమియా వివరించాడు.

అదే అదనుగా నాన్న, మామయ్యలు రామనర్సయ్య గారి వివరాలు కూపీ లాగడం మొదలు పెట్టారు.

అడిగినవాటికి నమాధానాలు చెప్పిన కరీంమియా "ఏందిబాబూ ! ఏ మన్న పెళ్లి ముచ్చట్లకు బోతుండ్రా? అంటూ కుతూహలంగా అడిగాడు.

"ఔను. మా చెల్లికి సంబంధం చూద్దామని వెళుతున్నాం." చెప్పానేను

"అ.. మధ్యవర్తి చెప్పిందానికీ, ఇతను చెబుతున్న దానికీ తేడా ఏం లేదు బావా ! ఈ సంబంధం ఖాయంజేస్తేనే పోయేట్టుంది." మంత్రాంగం మొదలు పెట్టాడు మామయ్య.

"చూద్దాం ! తినబోతూ రుచడగడమెందుకు!?" నాన్న గుంభనం షరామామూలే...

"మీ అమ్మాయిగారా ఇంట్లో పడితే సుఖపడుద్ది బాబూ ! తలవెనక్కి తిప్పి చూస్తూ అన్నాడు కరీం.

"ఇదుగో అబ్బీ ! నీ నోటి వాక్యాన సంబంధం కుదిర్తే... అమ్మాయి పెళ్ళిలో నీకో బట్టల జత పెడతావోయ్." కరీంమియాతో అన్నాడు మామయ్య.

**పింగళి వెంకయ్య**

ఆగష్టు 2, 1878వ సం॥లో కృష్ణాజిల్లా, బట్లపెనుమర్రు గ్రామంలో జన్మించిన పింగళివెంకయ్య బొంబాయిలో సైనికుడిగా తర్ఫీదుపొంది ఆఫ్రికా వెళ్ళారు. 1911 – 1919 మధ్యకాలంలో బందరు జాతీయ కళాశాలలో అధ్యాపకునిగా పనిచేశారు. ఈయన బొగ్గు వజ్రంగా మారే విధానాన్ని గూర్చి "తల్లిరాయి" అనే పుస్తకం వ్రాశారు. 1921లో గాంధీజీ ఆదేశానుసారం త్రివర్ణ పతాకాన్ని రూపొందించారు. గాంధీ సూచన మేరకు దానిపై రాట్నం గుర్తును చేర్చారు. 13-4-1921 నాటి **"యంగ్ ఇండియా"** పత్రికలో గాంధీజీ పింగళి వెంకయ్యగారిని ప్రత్యేకంగా ప్రశంసించారు.

మామయ్య మాటలకు సిగ్గుపడుతూ "నాకెందుకు బాబూ ! ఆ... నర్సింసామి దయుంటే సాలుగాని ఏదైనా జర్గుద్ది." గుఱ్ఱాన్ని అదిలిస్తూనే అన్నాడు కరీం మియా.

మాటల్లోనే జట్కా జయంతిపురం ఊళ్ళో కొచ్చింది.

కరీంమియా జట్కాబండినోకొట్టుముందాపి కిందకు దిగాడు. దిగుతూ, దిగుతూనే ఎడమ పక్క మేకు పైకి రావడం గమనించి రోడ్డు ప్రక్కనే ఉన్న రాయినొకదాన్ని తీసుకొని మళ్ళీ లోపలికి కొట్టాడు.

కాళ్ళూ, చేతులు కాస్త సళ్ళొదులు తాయని మేమూ కిందకుదిగి అలా ముందుకెళ్ళాం. ఊరికి నైబుతిమూలలో ఉన్న కోట గత ప్రాభవాన్ని కోల్పొయి, విషాద గంభీరంగా కన్పిస్తుంది. ఆ కోట చుట్టూ వేసుకున్న గిరిజనుల చిన్ని, చిన్ని పూరి గుడిసెలు దారిద్ర్యాన్ని శ్వాసిస్తున్నాయి.

జట్కా కింద జాలీలో ఉన్న కిరాణా సరుకుల మూటల్ని దుకాణంలో అప్పగించి మా వైపు జూస్తూ "రాండి బాబూ !పోదాం రాండి !" అంటు పిలిచాడు కరీంమియా.



ఓ.... కుదుపుతో ఆటో మళ్ళీ ఆగడంతో కరీం మియా జ్ఞాపకాల్లో నుండి బయటపడ్డాను.

"ఎక్కడి దాకా వచ్చామో" అని బైటికి చూసే సరికి ఏదో ఓ... కొత్త కాలనీలో ఆగిఉంది! ఈ కాలనీ ఎప్పుడు కట్టారు" పక్క ప్రయాణీకుణ్ణి అడిగాను.

"ఐదారేండ్లైంది. ఈ చుట్టు పక్కల క్వారీల్లో, సిమెంట్ ఫ్యాక్టరీల్లో పన్జేసే వాళ్ళకోసం కంపెనీ వాళ్ళే కట్టిచ్చారు."

"ఓహో ! అలాగా !" అంటూ చుట్టు పక్కల పరజూశాను. ఈ కొండల మద్యకూడా నాగరికత తాలూకా వికృత రూపం బడ్డీ కొట్లముందు కూల్‌డ్రింకులూ, గుట్కా దండల రూపంలో దర్శనమిస్తున్నాయి. దూరంగా ఉన్న సిమెంట్ ఫ్యాక్టరీలు వెలువరిస్తున్న పొగ, దుమ్ము, ధూళీ మేఘాల్లా తేలివస్తూ.... చుట్టూ ఉన్న చిట్టడవిని బూడిద కుప్పలుగా మారుస్తున్నాయి.

"ఓ సారీ.... ఆటోవాలా నడిగితే కరీంమియా ఆచూకేమైనా చెబుతాడేమో" అనుకొని "బాబూ !ఇంతకు ముందీరోడ్డులో కరీంమియా అనే జట్కావాలా తిరుగుతుండేవాడు నీకేమైనా తెలుసా? అంటూ అడిగాను.

"తెలియదు" పుల్ల విరిచినట్టుగా చెప్పాడు.

"ఇదే.. కరీంమియా ఐతే...?" మళ్ళీ నాలో ఆలోచన్లే.



మేం ఎక్కి కూర్చున్న తరువాత జట్కా కదిలింది.

మెరక మీద నిదానంగా నడిచిన గుఱ్ఱం కాస్తా పల్లం రాగానే దౌడు తియ్యసాగింది. ఆ.... పరుగుచూసి భయపడిన మామయ్య" అరే ! మియా ! గుఱ్ఱంకాలు జారేను జాగ్రత్త" అడ్డు పెట్టిన ఇనుప కమ్మీని గట్టిగా పట్టుకుంటూ.

లేదుబాబూ ! మా రాముడి గురించి మీకు తెలియదు. వాడికీ రోడ్లన్నీ కొట్టినపిండే.. ఎక్కడ? ఎట్లా నడవాలో వాడికి బాగా దెల్సు" చెప్పాడు కరీంమియా.

అద్సరేగాని, గింజాపల్లికిప్పుడు పడవుంటుందా? అడిగాడు నాన్న.

"నమ్మకం తక్కువ బాబూ! మద్దేనాలైందిగా... పడవాల్లంతా గింజాపల్లోల్లే. నావను ఆవలి రేవుల్లో వదిలి అన్నాలకు బొయ్యుంటారు."

"అయ్యో ఇప్పుడెలా మరి? సాయంత్రానికల్లా తిరిగెళ్ళాలే..." దీర్ఘం తీస్తూ అన్నాడు మామయ్య.

"ముందాడికి పోని య్యండి సూద్దాం" ఏదో ఉపాయం ఆలోచించొచ్చులే అన్నట్టుగా అన్నాడు కరీంమియా

మాటల్లోనే జట్కావచ్చి గుడికి కొంచెం ఈవలగా ఉన్న మర్రి గున్నకిందాగింది.

**జంధ్యాల పాపయ్య శాస్త్రి**

విజయశ్రీ, కరుణశ్రీ, ఉదయశ్రీ కలం పేర్లు కలిగిన మధురకవి శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి. ఉమర్ ఖయ్యాం, పుష్పవిలాపం (ఘంటసాల గానం చేశారు) మొదలైన కవితా ఖండికలు బహుళ జనాదరణ పొందాయి. మృదు మధురమైన పద్య రచనా శైలి వీరి ప్రత్యేకత. కరుణశ్రీ ఆగష్టు 4, 1912వ సం॥లో జన్మించారు.

"అరే... బేటా ! రామూ ! భలేవాడ్వీరా ! మాటల్లోబడి సూన్నేలే... సక్కగొచ్చి చెట్టు కిందాగినవే!" అంటూ గుఱ్ఱాన్ని మెచ్చుకుంటూనే బండెనక్కొచ్చి ఇనుపకమ్మి తప్పినస్తా.... "దిగండిబాబూ!" అన్నాడు.

మేం దిగ్గానే గుఱ్ఱం మెడ మీదనుండి జట్కాబండిని తప్పించి రోజాకు కట్టేసి, జట్కాకింది జాలీలో ఉన్న పచ్చిగడ్డి తీసి దాని ముందు పడేశాడు.

## హిరోషిమా డే

అమెరికా బి29 విమానం జపాన్‌లోని హిరోషిమా నగరం మీద ఆగష్టు 6, 1945వ సం॥లో ఉదయం గం॥ 8.15 ని॥లకు బాంబు వేసింది. అగ్ని జ్వాలలతోపాటు, అణు ధార్మిక శక్తి చెలరేగి 70 వేల మంది మరణించి ఉండవచ్చని అంచనా. అమెరికాకు 33వ అధ్యక్షుడైన (1945-52) హారీ్ట్రూమన్ (1884-1972) హిరోషిమా, నాగసాకిలపై ఆటం బాంబులు వేయమని ఆదేశాలిచ్చాడు.

లోపలి గుడిలో భక్తులు కొడుతున్న గంట చప్పుడు కృష్ణానది తరంగాల్లోనూ.. చుట్టూ ఉన్న కొండల్లోనూ ప్రతిధ్వనిస్తూ... పవిత్ర దైవీభావన తనూ, మనస్సులను పునీకరిస్తుంటే.. గుడివైపు కదిలాము.

దైవదర్శనానికి ఆలయంలో ప్రవేశించాము.

వేదాద్రి నరసింహుడు పశ్చిమాభిముఖుడై కొలువుదీరి, దక్షిణ దిశగా సాగిపోతున్న కృష్ణవేణి హొయలను యోగానందుడై వీక్షిస్తూ... భక్తులను పాలిస్తున్నాడు.

మేము దైవదర్శనం చేసుకొని బయటికొచ్చే సరికి సింహద్వారము వెనుకనున్న జమ్మిచెట్టు నీడలో కూర్చుని కరీంమియా పులిహోరను కళ్ళకద్దుకొని తింటున్నాడు.

మనిషి బాహ్యంగా ఎన్నో పరిమితులకు లోబడి జీవించాల్సి వచ్చినా... అంత:కరణలో సార్వజనీనతా మూలాలకు అనుసంధానం చేయబడతాడు. అనేదానికి నిదర్శనం కరీంమియా అప్రయత్నంగానే ప్రసాదాన్ని కళ్ళకద్దుకొని తినడమే.

గుడి ఆవరణలో నుండి కృష్ణమ్మ ఒడిలోకి ఉన్న మెట్ల పైభాగంలో నిలబడి చూస్తున్న మాకు మేఘవర్ణంలో బిర,బిరా సాగిపోతున్న కృష్ణమ్మ తన శత సహస్ర అలల కరాలెత్తి ఆహ్వానగీతం పలుకుతున్నట్టుగా ఉంది. చిన్న, చిన్న నాటు పడవల్లో తిరుగాడుతున్న జాలర్లు చాపల వేటకు విసురుతున్న వలలు కళాత్మకంగా కదులుతున్నాయి. కొందరు భక్తులు ఆ తల్లి ఒడిలో సున్నానితులై ఆనందిస్తుంటే... మరి కొందరు వివిదాకృతుల్లో ఉన్న నునుపైన రాళ్ళను ఏరుకుంటున్నారు. తీగలు సాగిన నాచు పాయలు కృష్ణవేణి సిగలో పచ్చి మొగలిరేకుల్లా మెరుస్తున్నాయి.

కరీంమియా చెప్పినట్టు పడవ గింజుపల్లి రేవులోనే ఉంది. అప్పుడు మామయ్య కరీం మియావైపు తిరిగి "జానుకరీం ! నువు చెప్పినట్టు పడవ అటువైపే ఉందికదా ? ఏంజేద్దాం" అన్నాడు.

"ఏదోకటి చేద్దాం రాండి !" అంటు గుడి ఆవరణలోని ఆఫీసు రూం వైపు దారితీశాడు. అతని వెనుక మేమూ నడిచాం. సరాసరి ఆ.... ఆఫీస్ గుమస్తా దగ్గరకెళ్ళి "చూడండి గుర్నాధం బాబూ ? ఆ.... గింజుపల్లి రామనర్సయ్య గారింటికి చుట్టాలెవరో పెండ్లి చూపులకొస్తున్నారు. ఆ పన్జాసుకొని ఎమ్మటే తిర్గి పోవాల్నంట ! నావజూస్తే... ఆవలిరేవులో ఉంది." వివరించాడు కరీంమియా.

"రామనర్సయ్య గారింటికా ? అంటూ లేచిన గుమస్తా పక్కనే ఉన్న గది తాళం తీసి అక్కడున్న మైక్‌సెట్ ఆన్‌జేసి "హలో... హలో.... గింజుపల్లి రామనర్సయ్య గారింటికి చుట్టాలొస్తున్నారు, నరంగులు నావను గుడిరేవుకు ఎమ్మటే తీసుకురాండి!" అంటు మూడు నాలుగు సార్లు మైక్‌లో ఎనౌన్స్‌మెంటిచ్చాడు. మైక్‌లో.. ఆ ప్రకటన చుట్టూ ఉన్న కొండల్లో ప్రతిధ్వనించి ఎంతో దూరం విన్పిస్తుంది.

ఎనౌన్స్‌మెంటిచ్చిన గుమస్తాతో బాటు మేమంతా మెట్లపైన నిలబడి ఆవలిరేవులోకి చూడసాగాం... కొద్దిసేపట్లోనే రేవులోకి మనుషులు రావడం కన్పిస్తుంది! ఆ... వస్తున్న వాళ్ళల్లో ఒకడు తన వంటి మీది తువ్వాలును రెండు, మూడు సార్లు గాల్లోకూపాడు!! అది చూసిన గుమస్తా మా వైపు తిర్గి "మీర్రేవుల్లోకెల్లండి, వాళ్ళొచ్చేస్తున్నారు" అన్నాడు.

ఆ ఏర్పాట్లకు మేం విస్తుబోయి చూస్తుండగానే.... ఆవలి రేవులో పడవకదిలింది. !

"పడవొస్తుందిగాని ఎక్కి పోండిబాబూ ! అవతల నా బండికి నారేసుకోవాల" అంటూ వెను తిరుగుతున్న కరీంమియాతో "అదేంటి మియా ? జట్కాకిరాయి తీసుకోకుండానే పోతానంటావేంటి?!" అంటూ డబ్బులు తీసిచ్చిన నాన్న "చాలా సంతోషం కరీంమియా ! చాలా సాయంజేశావు" మనస్ఫూర్తిగా అంటూ కరీంమియా భుజం తట్టాడు.

అప్పుడు కరీం "అదేందిబాబూ ! అట్ల మాట్లాడుతుండ్రు !? మా... రామనర్సయ్యగారి చుట్టాలు మా అందరికీ చుట్టాలే..." అన్నాడు.

కరీంమియా హృదయపులోతుల్లో నుండి వస్తున్న ఆ... ఉమ్మడి బ్రతుకుల కమ్మని పలుకులు మా గుండెల్లో ఆనందభైరవి ఆలపించినట్టనిపించి, కనుకొలుకుల్లోనుండి అనుభూతి ముత్యాలు జారాయి.



అప్పుడే వచ్చిన ప్రభబండ్లకు కట్టిన మైకుల మోతతో మధురమైన ఆలోచనల హరివిల్లు చెదిరిపోయి కళ్ళు తెరచే సరికి ఆటోవచ్చి కరీంమియా జట్కాబండి ఆపే మర్రిచెట్టుకిందే ఆగింది !

ఇప్పుడా చెట్టు వటవృక్షమై ఊడలు దిగిఉంది. రక రకాల దుకాణాలు జనంతో కిటకిట లాడుతున్నాయి. ఆ చుట్టుపక్కల చాలా కాటేజీలు నిర్మించారు. మొత్తం మీద ఈ ఇరవై ఏండ్లలో ప్రశాంత గంభీరంగా ఉండే గుడి పరిసరాలు ఊహించనంతగా నగరీకరం చెందాయి. చిత్రంగా ఎవరిచేతుల్లో జూసినా రక రకాల సెల్‌ఫోన్లు రక రకాల రింగ్‌టోన్లతో వినిపించ సాగాయి...!

కలవాలని ఆశ పడుతున్న కరీంమియా మాత్రం కన్పించడం లేదు. ఆ చెట్టు దగ్గర్లోనే ఉన్న కుళాయి దగ్గర కాళ్ళూ, చేతులు కడుక్కుని వచ్చి చెట్టు నీడలో నిల్చున్నాను. చెట్టునీడ కరీంమియా స్నేహంలా హాయిగా అన్పిస్తుంటే... ఆలోచనలు మళ్ళీ గతం తలుపులు తెరిచాయి.



మెల్లగా రేవులోకి దిగాం
పడవ కోసం చాలా మంది
కాసుక్కూర్చున్నారు.
పడవ నది మధ్యలోకొచ్చింది
ఆవలి రేవులో చాలా మంది జనం పోగౌతున్నారు !

పడవ మా రేవుకొచ్చి ఆగింది. "రామనర్సయ్య గారింటి కొచ్చిందెవరు బాబూ ?' అడిగాడు అప్పటి దాకా చుక్కాని పట్టిన ముసలాయన.

"మేమే..." మామయ్య చెప్పాడు.

"రాండి బాబూ ! ఎక్కండి" మెట్ల చెక్కను కిందకు జారవిడుస్తూ అన్నాడు మరో పడవతను. మేమిక్కిందాకా పక్కకు జరిగి నిల్చున్న మిగతా ప్రయాణీకులు, మేమెక్కగానే చక,చకా ఎక్కేశారు. పడవ మెల్లిగా గింజుపల్లి రేవుకేసి కదలసాగింది.

అందర్లాగే మేమూ డబ్బులు ఇవ్వబోతే "అయ్‌బాబో ! రామనర్సయ్యగారి చుట్టాల దగ్గర డబ్బులు తీసుకుంటా మటండీ ! తప్పుగదూ!" అంటూ మా దగ్గర ససేమిరా డబ్బులు తీసుకోలేదు. స్థిమితంగా కూర్చున్న తరువాత పడవలో వాళ్ళందరిని పరిశీలనగా చూశాను. ఒకావిడ గొంగూర తుంచి పక్కనే ఉన్న మేక పిల్లకు తినిపిస్తుంది. పడవ మధ్యలో పరచిన తడిక మీద కూర్చున్న ఓ పిల్లతల్లి బిడ్డకు పాలిస్తూనే ఇంకో పిల్లతల్లికి పేలుచూస్తుంది. ఆ పక్కనే కూర్చున్న ముసలాళ్ళిద్దరు దమ్ము కొడుతున్నారు. ఎడంపక్క పడవ అంచున కూర్చున్న ఇద్దరు యువకులు నిన్నరాత్రి జగ్గయ్యపేట టూరింగ్ టాకీస్ లో చూసొచ్చిన ఎన్టీవోడి సినిమాకథ చెప్పుకుంటున్నారు. చుక్కాని

**తెలుగు అకాడమీ**

తెలుగు భాషను, అధికార భాషగా అభివృద్ధి పరచటానికి సూచన లిచ్చేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జె.పి.యల్. గ్విన్ అధ్యక్షతన ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పరచింది. రాష్ట్ర భాషా సంస్థ నొక దానిని నెలకొల్పాలని ఈ నిపుణుల సంఘం సూచించింది. ఉన్నత విద్యా స్థాయిలో ప్రాంతీయ భాషలను బోధనా మాధ్యమాలుగా ప్రవేశ పెట్టేందుకు ప్రాంతీయ భాషా సంస్థలను స్థాపించటానికి భారత ప్రభుత్వం ఒక ప్రణాళికను రాష్ట్ర ప్రభుత్వాలకు 1967లో అందించింది. ఈ నేపథ్యంలో తెలుగు అకాడమీ ఆగష్టు 8, 1968 నుండి పని చేయడం ప్రారంభించింది.

వైపు నిల్చున్న కన్నె పిల్లలిద్దరు గాల్లోకి లేచిపోతున్న వోణీలను బలంగా అదిమిపట్టి బొడ్లో దోపుకుంటుంటే... వాళ్ళకి ఎదురుగా కూర్చున్న కోణంగులిద్దరు కొంటె మాటలు రువ్వుతున్నారు. అక్కడున్న వాళ్ళందరిలోనూ ఓ పల్లెటూరి నిర్మలత్వం కొట్టొచ్చినట్టు కన్పించసాగింది.

**హర్ష**

6-8-1986న మొదటి భారతీయ టెస్ట్ ట్యూబ్ బేబీ జన్మించింది.

ఈ టెస్ట్ ట్యూబ్ బేబీని అందించిన వారు డా॥ ఇందిర హిందూజ.

ఈ బేబీ పేరు 'హర్ష'.

పడవ నడిచినట్టేలేదు ! గింజుపల్లి రేవుకు చేరుకున్నాం.

రేవులో రామనర్సయ్య గారితోసహా మాకోసమే ఎదురు చూస్తున్న ఊరిజనం పడవ దిగిన మాకెదురొస్తూ.... "రండి ! రండి ! మీ కోసమే ఎదురు చూస్తున్నాం" అంటు మధ్యవర్తి సాదరంగా ఆహ్వానించాడు. అక్కడున్న ఊరి వాళ్ళందర్నీ పేరు పేరున పరిచయం చేశాడు. ఆ... ఊరుమ్మడితనం మా ఊహల్లోక్కూడా అందని మధురమైన అనుభవం.

రేవులో నుండి మొదలైన వాళ్ళ ఆదరణా... ఆప్యాయతలు మమ్ముల్ని ఊపిరికూడా సలుపనివ్వలేదు.

మాటా... మంతి జరిగాయి. ఇరువైపులా అన్ని విషయాలు, అందరికీ నచ్చాయి.

సంబంధం ఖాయమైంది.

సంతృప్తిగా తిరుగు ప్రయాణం ప్రారంభమైంది. ఊరంతా కదిలొచ్చి రేవుదాకా సాగనంపింది.

వేదాద్రి రేవుకు చేరుకొని మళ్ళోసారి దైవదర్శనం చేసుకొని బైటికొచ్చామో లేదో "రండి బాబూ ! రండి ! మీకోసమే ఎదురు జూస్తున్నా. చీకటి బడితే మీ కిబ్బందైద్దని" ఎదురొస్తూ అన్నాడు కరీంమియా.

"అయ్యో ! పాపం ! మా కోసం ఎదురు చూస్తున్నావా !?" అంటూ జట్కాఎక్కి కూర్చున్నాం.

జట్కా జగ్గయ్యపేటవైపు దౌడుతీస్తుంటే... మెల్లగా వెనక్కి తిరిగి 'ఎల్లినపని పండా? కాయా? బాబూ !" అంటూ అడిగాడు కరీంమియా.

"నువ్‌చెప్పిం తర్వాత పండేగాని, కాయెట్టైతది!?" మామూలుగానే చాలా తక్కువగా మాట్లాడేనాన్న సంబంధం కుదిరిందన్న ఆనందంలో గల, గల మాట్లాడుతుంటే.... మామయ్యతో బాటు నేనూ ఆశ్చర్యపోయాను.

నాన్న మాటలకు కొంచెం సిగ్గువడుతూ... "నాదేముంది బాబూ ! అంత ఆ... ఏలాద్రి సామిదయ" అంటు గుడివైపు చేతులెత్తి చూపిస్తూ అన్నాడు కరీంమియా...

జగ్గయ్యపేట చేరేంత వరకు కరీంమియా ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉన్నాడు.

చెల్లిపెళ్ళి, అత్తవారింటికి కాపురానికి వెళ్ళేదాకా నేనెన్నిసార్లు గింజుపల్లి వెళ్ళానో లెక్కేలేదు. వెళ్ళిన ప్రతిసారీ కరీంమియా జట్కాబండి తప్పదుకాబట్టి మా ఇద్దరి మధ్య పరిచయం, స్నేహంగా మారి గాఢంగా అల్లుకుపోయింది. దానికి వయసు వ్యత్యాసాలు కూడా అడ్డంకి కాలేదు.

ఆ.. స్నేహబంధం జీవిత సంద్రంలో బ్రతుకు అవసరాల ఆటు పోట్లకు విచ్చిన్నమై పోయింది. ఒక అల నన్ను అమెరికాదాక విసిరేయడంతో ఇరవైఏండ్ల ఎడబాటు ఏర్పడింది.

  

ఓ... టూరిస్ట్ బస్సు నిండా వచ్చిన యాత్రికుల కోలాహలంతో ఆలోచనలు చెదిరిపోవడంతో...? అక్కణ్ణుండి నెమ్మదిగా గుడివైపు కదిలాను.

పుష్కరాలకోసం చేసిన ఏర్పాట్లతో గుడి పరిసరాలు కనువిందు చేస్తున్నాయి.

యాత్రికుల రద్దీలో సైతం నా కళ్ళు కరీంమియా కోసం వెతుకుతూనే ఉన్నాయి.

నదిలోకి దిగే తొలి మెట్టు మీద నిలబడిన నాకు గత మంతా కళ్ళ ముందు కదలాడసాగింది.

రేవునిండా భక్తులు, వాళ్ళ మధ్య రక రకాల వస్తువులమ్ముకుంటూ తిరుగుతున్న చిల్లర వ్యాపారులు.

ఆయిల్ ఇంజన్లతో నడుస్తున్న పడవలు రెండు

ఎదురెదురుగా వస్తున్నాయి. వాటిని గమనించిన నేను "ఓహో మనుషులు కష్టపడి తెడ్లు వేయకుండా ఇదో మంచి మార్పేనే!" అనుకున్నా.

సరిగ్గా అప్పుడే...!!?

దూరంగా రేవులో జనం మధ్య 'టి' క్యాన్ పట్టుకొని అటూ.... ఇటూ.... తిరుగుతున్న ఓ వ్యక్తి నా దృష్టిలోకొచ్చాడు ! అదేనడక ! అదే(డస్సు ! అదే టోపి కాకపోతే ఇతను ముసలాడు ! అతను వయసోడు. ఔను ముసలాడే... ఇరవై ఏండ్ల తరువాత ఎలా ఉంటాడు? ఇలాగేఉంటాడు. ఎన్ని బాధ్యతల బరువులు మోశాడో ? ఎన్ని సమస్యల సుడులలోబడి విలవిల్లాడాడో ? సందేహంలేదు ఇతనే అతను మరైతే జట్కా బండేమైంది !? ఈ...'టీ' లమ్ముతున్నాడెందుకు ? ఏం అమ్మగూడదా ? అమెరికాలో నేనెన్ని ఉద్యోగాలు చెయ్యలేదు ? ప్రశ్నలు, ప్రశ్నలు నదిలోని అలల్లా ప్రశ్నలు తరుముకొస్తుంటే ఇహ అక్కడ నిలబడలేక గబ, గబా మెట్లుదిగి అతన్ని చేరుకునే సరికి, అతను అటువైపు తిరిగి ఎవరికో 'టి' అందిస్తున్నాడు. ఉద్వేగపు పొర ఏదో నా స్వరాన్ని వణికిస్తుంటే... "కరీంమియా..." అన్నాను.

"ఆ" వెనక్కి తిరిగాడతను.

"ఔను కరీంమియానే... !!" అనుకున్నా కళ్ళకు చత్వారం అద్దాలు, రాలిపోయిన ముందుపండ్లు, పండిపోయిన జుట్టు బాగా ముసలాడై పోయాడు ! నా ఆలోచనల్లో నేనే...

నన్ను గుర్తు పట్టలేని కరీంమియా 'ఎవరు బాబూ" అన్నాడు కళ్ళద్దాల్లో నుండి తలపైకెత్తి చూస్తూ.

"నేనుకరీం!" అంతకు మించి మాటరావడం లేదు.

"................" గుర్తుపట్టలేని అసహాయత.

"కన్నయ్యను కరీం !"

"కన్నయ్యా....!?" సాలోచనగా అంటున్న అతని కన్నుల్లో.... బుస, బుస మని ఒక్కసారిగా ఆశ్చర్యపు పొంగులు ! నన్ను గుర్తు పట్టాడనడానికి గుర్తుగా....

"బాబూ ! మీరా !!? ఎన్నేండ్లకి ?" అంటూ నా దగ్గరకొచ్చి 'టి' క్యాన్ని వదిలేసి కౌగిలించు కున్నాడు. మా కళ్ళల్లో ఆర్ద్రతా ఊటలు, మాటలు రాక పేరుకు పోతున్న మౌనం ఒక్క సారిగా మా స్నేహ సౌరభాన్ని హిందోళీకరించి మా చుట్టూ ఉన్న వాయుతరంగాల్లో సంయోజనం చెందసాగింది....

ఆక్షణంలో మమ్ముల్ని చూస్తున్న రేవులోని జనం ఒకింత ఆశ్చర్య పడడం నాకు తెలుస్తూనే ఉంది.

కొంత సేపటికి తేరుకున్న నేను "ఏంటిదికరీం! ఇంతలా మారిపొయ్యావేంటి !? ఈ 'టీ' లమ్ముతున్నావెందుకు ?! జట్కా ఏమైంది ? రాముడెలా ఉన్నాడు?" నా ప్రశ్నల్లో పరిపక్వతాలేమి తెలుస్తూనే ఉంది.

"రాముడా !? రాముడెప్పుడో చచ్చిపోయ్యాడు బాబూ ! వాడితోబాటే ఆ.. జట్కా బండీ మూలనబడింది. ఈ రోజుల్లో ఇంకా ఆ... జట్కా బండ్లెవరెక్కుతారు బాబూ !? ఆటోలు, జీపులు, కార్లు కావాల్సినన్నిచ్చినై. ఆ రాముణ్ణీ, జట్కాను నా భార్యా పిల్లలే ఎప్పుడో మర్చిపొయ్యారు. ఐనా మీరింకా గుర్తుపెట్టు కున్నారాబాబూ!?" కరీంమియా మాటల్నిండా ఆశ్చర్యపు మెరుపులే...

"అదేంటికరీం!? మనస్నేహాన్ని, ఆ రాముణ్ణీ ఎలా మర్చిపోతాననుకున్నావ్?! " నాకంఠంలో అభిమానపు నిష్ఠూరత.

ఎప్పుడో అమిరికా ఎల్లిపోయిన మీకింకా నేను గుర్తున్నానంటే అది మీ గొప్పతనం బాబూ !.

ఇంతలో వడవ రేవులోకొచ్చి ఆగింది. వచ్చిన పడవకేసి చూస్తున్న నా మనసు చదివినట్టే "ఏంటి బాబూ ! తెడ్లెయ్యకుండ నావను అయ లింజన్లతో నడుపు తున్నారనా ? కాలం మారి పోయింది బాబూ ! ఎవ్వరు వోటు కష్టం జెయ్యట్లే.... ఏపనైనా సులభ సూత్రంగ జేస్తున్నారు." అన్నాడు కరీంమియా.

**రవీంద్రనాథ్ టాగూర్**

చిత్రకారుడు, కథకుడు, నవలాకారుడు, కళావిమర్శకుడు, విద్యావేత్త అయిన టాగూర్ ఆగష్టు 7, 1941వ సం॥లో మరణించారు. మొదటి నుంచీ ఈయన ప్రకృతి ఆరాధకుడు. 1913లో 'గీతాంజలి' అనే వీరి కవితా సంపుటికి నోబెల్ బహుమతి లభించింది. రవీంద్రుడు స్థాపించిన శాంతి నికేతన్ నేడు **"విశ్వభారతి యూనివర్సిటీ"** గా ప్రసిద్ధి పొందింది. గాంధీజీ వీరిని 'గురుదేవ్' అని సంబోధించారు. కలకత్తా కాంగ్రెస్ సభలో పాడేందుకు వీరిచే రచింపబడిన 'జనగణమన' గేయం మన జాతీయగీతమైంది.

"ఔనుకరీం నా ఊహల్లో ఉన్న వేదాద్రికీ.... నేను చూస్తున్న వేదాద్రికీ ఎక్కడా పోలికే లేదు. సిటీల్లో ఉన్న వాళ్ళకంటే కూడా ఇక్కడున్న వాళ్ళు ఎక్కువమంది సెల్‌ఫోన్లు వాడుతున్నారు." ఆకాశంలో కొండల్లా పెరుక్కొస్తున్న నల్లటి మబ్బుల్ని చూస్తూ.... అన్నాను.

"అదా ? గుడివైక్, ఇప్పుడెవ్వరికీ ఇయ్యట్లే... అందుకే కిష్టవతలోళ్ళంతా ఫోన్లు పెట్టించుకుండ్రు, ఐనా ఏంలాభం?" అన్నాడుకని పించని అలజడి ఏదో అతని స్వరంలో లీలగా కదలాడు తుంటే...

"ఏమైంది?"' అడిగాను ఏదో జరిగే ఉంటుందన్న ఆలోచన నాలో మొలక రిస్తుంటే...

'ఏముంది బాబూ ! ఏ... అర్ధమరేత్రికాడో అన్నలు రావడం టెలిఫోన్ ఆఫీసులు పేల్చెయ్యటం! దాంతోటి మల్ల ఆరేడు నెల్లదాకా ఫోన్లు బంద్. ఈ గోలంతెందుకని లేసినోడు, లేవనోడు అందరూ సెల్ ఫోన్లు కొనుక్కుంటుండ్రు" ఈ ఊళ్ళో కాలు మోపిన దగ్గర్నుండి నా మదిలో మెదులుతున్న సందేహం నివృత్తి అయ్యేలా అసలు విషయం వివరించాడు కరీంమియా.

"అదా సంగతి" ఏక్షణంలోనైనా వర్షం పడేలా ఉంది.

"ఔను బాబూ !" ఫెళ, ఫెళా ఉత్తర దిశగా ఉరుములు

"అది సరేగాని కరీం ! ఈ వయసులో .... ఈ ఇసుకలో... ఈ జనం మధ్య, ఈ టీ క్యాను పట్టుకొని తిరగడం కష్టమని పించడంలేదా ?!" చిటపట, చిటపట చినుకులు రాలుతునే ఉన్నాయి.

రేవులో జనమంతా తుపాకీ శబ్దం విన్న చెట్టు మీద పక్షుల్లా మెట్లమీదిగా గుళ్ళోకి పరుగో పరుగు.

నేనూ... కరీం వర్షంలో తడుస్తూ... నే చివరి మెట్టు మీద కూర్చుని కాళ్ళను నీళ్ళలో వదిలేశాం. మాలాంటి వాళ్లింకొందరు అక్కడక్కడా మిగిలి ఉన్నారు !

ఇందాకటి నా ప్రశ్నకు సమాధానంగా "కష్టమెందుకు బాబూ ! బతకడానికి ఏదో ఒకటి చెయ్యాలిగా.... మా తాతలు, తండ్రులు జయంతిపురం కోటలో కావలి దార్లుగా బతికిండ్రుట. మా కాలం వచ్చే తలికి కోటలో పన్లు దొరక్క కూలి, నాలి జేసుకుంట బతకసాగినం. నేను మాత్రం ఆ జట్కాబండి బెట్టుకొని రోజులు నెట్టుకొచ్చిన, చూస్తుండగనే. కాలం మారిపోబట్టింది. రిక్షాలొచ్చి నాగిరాకీ సగం దగ్గింది. ఐనా నీళ్ళా మాటగా కాలం నెట్టుకొన్తుండగానె. ఆటోలొచ్చిపడ్డయ్. ఆ దెబ్బతో నా జట్కాబండి పూర్తిగా మూలబడ్డది. మాతో పాటు గుఱ్ఱానికి కరువొచ్చింది. అంతలోనే దానికేదో జబ్బుజేసి చచ్చిపోయింది. బతుకు తెరువుకు రక రకాల పనులు జేసిన. పిల్లలు పెద్దోళ్ళై పెండ్లిల్లు జేసుకొని ఎవరి బతుకు వాళ్ళు బతుకుతుండ్రు నేనూ... నా ముసల్దీ బతకడానికి ఈ 'టి' దబ్బాసాలు" బ్రతుకు సమరంలో అలుపెరగని సిపాయిలా తన బ్రతుకును నా ముందు గుమ్మరించాడు కరీంమియా.

"........" నాకు మాటలు కరువయ్యాయి. కాళ్ళక్రింద ఉన్న రాళ్ళను తీసుకొని నదిలోకి విసురుతున్నాను,

తనే మళ్ళీ" అటు చూడండి ! కన్నయ్యబాబూ ! ఆ.... కిష్టతల్లికి వచ్చే నీరు వస్తుంటే... పొయ్యేనీరు పోతూనే ఉంటుంది. మన బతుకులూ అంతే... ఎప్పుడూ ఒక్క తీరుగ నిలవాలంటే కుదర్నేకుదర్దు. నా చిన్నప్పట్నుంచి ఆ కిష్టతల్లిని జూసే బతకడమెట్లానో నేర్చుకున్నా. కరీంమియా చెబుతునే ఉన్నాడు.... జీవితాన్ని కృష్ణమ్మతో పోలుస్తూ.... చెబుతున్న కరీంమియా నాకళ్ళకు జట్కా కరీంలా కాదు ! ఓ... తత్త్వవేత్తలా... కన్పించసాగాడు... !

చినుకులు పడుతునే ఉన్నాయి.... కరీంమియా ద్వారా జీవన తత్త్వాన్ని బోధించిన కృష్ణమ్మ నన్ను ఆశీర్వదిస్తూ... దుర్గమ్మ వైపు సాగిపోతూనే ఉంది...... ★

### నాగసాకి డే

జపాన్‌లోని నాగసాకి పట్టణం అమెరికన్ బాంబు దాడికి ఆగష్టు 9, 1945న గురై సుమారు 80వేల మంది మరణించారు. బాంబుల ప్రయోగానంతరం రెండు రోజులపాటు వేడి వాయువులతోపాటు నల్లటి వర్షం కురిసింది. ఆ తర్వాత హిరోషిమా, నాగసాకి పట్టణాలను పునర్మించారు. నాగసాకి నేడు నౌకానిర్మాణానికి, 'మజ్దా' కార్లకు పేరుపొందింది.

అక్షరాలు గుప్పెడు - అణువులు పగిలిన చప్పుడు

ఇరవయ్యో శతాబ్దపు మినీ కవిత

# 'శతఘ్ని'

## వేయి కవుల సంకలనం

## 1901-2000

ఇరవయ్యో శతాబ్దంలో ప్రచురణ పొందిన మినీ కవితలకు స్వాగతం

ముద్రణ వివరాలతో మినీ కవితలు

పంపవలసిన చిరునామా

అశోక్ కుమార్, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతి నగర్, విజయవాడ-520 004. సెల్ : 98485-04649

విద్యార్థులతో

## చినుకు

పంటలు పండిస్తుంది వర్షం

చినుకులు కురిపిస్తుంది వర్షం

దాహం తీరుస్తుంది వర్షం

అది అందిస్తుంది హర్షం

N. BABA GANAPATHI RAO
VIII A/s,
Sri Vijnana Vihara
English Medium School
Satyanarayanapuram
VIJAYAWADA-3

# శతవసంతాల

# పురిపండా అప్పలస్వామి

**- రామసూరి**

**క్రు**ళ్లిపోయిన పాత భావాలనీ, శిధిల సాంప్రదాయాలనీ కూకటి వేళ్లతో పెళ్లగించి, అభ్యుదయ భావచైతన్యాన్ని రగిలించిన సాహితీవేత్త పురిపండా అప్పలస్వామి. గిడుగు వారి అడుగుజాడలలో వాడుక భాషకి వెలుగుమేడలు నిర్మించిన ప్రగతి శీలి ఆయన 13-11-1904లో విజయనగరం జిల్లా సాలూరులో జన్మించి, 1921లో విశాఖ పట్నం వచ్చి, జాతీయోద్యమంలో పాల్గొన్నారు. కాంగ్రెసుపార్టీ సభ్యునిగా ఖద్దరు విక్రేతగా చైతన్యవంతమైన పాత్ర నిర్వహించారు మారేపల్లిరామ చంద్రకవిగారి సాంస్కృతిక నేపధ్యంలో విశాఖలో సాహితీ కార్యకర్తగా ప్రసిద్ధులయ్యారు. 1925-26లో 'స్వశక్తి' జాతీయ ఉద్యమ పత్రిక నడిపారు. బరంపురం 'వేగుచుక్క' గ్రంథమాలవారు 1927లో వీరి కవితల సంపుటి 'మురళీధ్వని' వెలువరించారు.



**తొలినాటి సంద్రాలు / తుహినగిరి శిఖరాలు**
**ఇంకి పోతున్నాయిలే /కుంగి పోతున్నాయిలే**
**తాత లేసిన పుంత / దైవ మేలిన సంత**
**పల్లేరు పాకిందిలే / జిల్లేడు మొలిచిందిలే**
**రాజు కట్టిన కోట / రాణి మెట్టిన తోట**
**భూతాలు గెంతాయిలే/బొమికలే నిండాయిలే**
**నల్లమందే కాని కళ్లిప్పనంటావు**
**రాతిగుళ్లకె కాని రాను పొమ్మంటావు**
**సుడిగాలి రేగిందిలే !/పిడు గావులించిందిలే!**

అంటూ కూలిపోతున్న శిధిల సాంప్రదాయాల దృశ్యాలన్ని సుడిగాలి అనే కవితలో చిత్రించారు

హేతువాదం పురిపండా కవితకి ఊపిరి. **కదలనిబొమ్మకి కాంచనమాలిక / మబ్బులరిచినా, మంటలెగసినా / వరదవచ్చి నదులెర్రవారినా / ధరణి వొణికినా, గిరులు పగిలినా/ గాలిరేగి వృక్షాలు కదిలినా /** అంటూ మానవ ప్రగతిని కోరిన అభ్యుదయ కాముకుడు ఆయన. పడమటి దేశాల యుద్ధోన్మాదాన్ని విమర్శించిన మానవ ప్రేమికుడు ఆయన. **"మండుతుంది మండుతుంది / పడమటింటి ప్రతిభూమి / రక్తం కక్కిన పులిలా / చచ్చిన సూర్యుడి దేహం / సంధ్యావాహకులెవరో / కాష్ఠంలో కాల్చినారు."**

ఈనాడు కూడా సామ్రాజ్యవాద దేశాల హీన సంస్కృతికి అద్దం పడుతుంది పురిపండా సాహిత్యం.

గాంధీగారు విశాఖ పట్నం వచ్చినప్పుడు, ఆయన ప్రభావంతో హరిజనోద్యమంలో పాల్గొన్నారు. **'గుడిలోని దైవమా! ఆలింపవోయి ! గుడిలోని దైవమా ! పైకి రావోయి ! నీ పాద పూజకై వెదకి తెచ్చిన పూలు, నీపాద సేవకై వెదకి తెచ్చిన నీళ్లు పనికి రావంటారు.** అంటూ జాతి జీవన స్రవంతిలో భాగం కావాల్సిన అట్టడుగు వర్గాలవారిని దూరం చేసిన మత ప్రవక్తల అజ్ఞానాన్ని ఖండించారు. అహంకారాన్ని ఈసడించారు.

భూస్వామ్య వ్యవస్థలోని నిరంకుశ విలాస క్రీడలని తూర్పార పడుతూ ఒక గ్రామంలో జరిగిన దారుణానికి కథన రూపాన్నిస్తూ చెప్పిన కవితలో **అమాసరాతిరి అంతా చీకటి మేఘం మీదా మేఘాలు! అమాసరాతిరి అంతా చీకటి చీకటి మీద**

**చీకట్లు / ఊడమీదనా ఊరి కబుర్లు ! ఆకు ఆకునా లోకం కథలు** అని ఒక రాణీగారి విలాసానికి బలైపోయిన నిరుపేద యువకుని కథని 'మల్లెల మడుగు' కవితలో అందించారు. వెట్టి చాకిరీని నిలదీస్తూ తన సాహిత్యంలో ప్రశ్నించారు.

1794 జూలై నెలలో జరిగిన పద్మనాభం యుద్ధాన్ని వీరరస ప్రధానంగా చిత్రించారు పురిపండా ఇక్కడ అడుగు పెడితే ! **ఎందుకో నావొళ్లు / కంపరమెత్తుతుంది / ఖద్దరు వొదిలేసి / కత్తి పట్టాలని పిస్తుంది / అహింస అబద్ధమనిపిస్తుంది / పద్మనాభం గాలినిండా వీరగాథలే / పద్మ నాభం ధూళినిండా వీరరక్తమే** అని దేశ భక్తిలో ఉత్తేజాన్ని కలిగించి జాతీయ ఉద్యమ స్ఫూర్తిని వెలిగించారు. **దు:ఖాగ్నికి పొగ ఉంటే / జగమంతా పొగ అయ్యేది** అంటూ 'కరువుకళ్ళ'ని చిత్రించారు పురిపండా

'కవితాసమితి' వ్యవస్థాపక సభ్యుడుగా, శ్రీశ్రీ 'ప్రభవ' కవితల ప్రచురణ కర్తగా, పులిపంజా కావ్యకర్తగా, పత్రికా సంపాదకుడుగా, వ్యవహారిక భాషోద్యమ కార్యకర్తగా, శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి నుంచి రా.వి.శాస్త్రి దాకా ఎందరో సాహితీ వేత్తలకి స్నేహపాత్రుడుగా, యువ కవులకి ఉద్యమ స్ఫూర్తి ప్రదాతగా పురిపండా ప్రసిద్ధుడు.

కాళిందీచరణ్ 'మట్టిమనుషులు', గోపీనాధ మహంతి 'అమృతసంతానం' వంటి నవలలని ఒరియా నుంచి తెలుగులోకి అనువదించి భారతీయ సాహితీ రంగంలో చైతన్యతరంగాలు సృష్టించారు. భారత భాగవత రామాయణాలని వాడుక భాషలోరాసి అందరికీ అందుబాటులోకి తెచ్చారు. తెలుగులో వంగ, ఒరియా సాహిత్య చరిత్రలు రాశారు. 'కళాపహాడు' అనే ఒరియా నాటకాన్ని తెలుగులో రాసి ప్రకటించారు. 'సౌదామిని' గీతాలు శ్రీశ్రీ ఇంగ్లీషులోకి అనువదించి ముద్రించారు. చివరిదాకా హేతువాదిగా జీవించి అభ్యుదయ భావాలకి జీవితాన్ని అంకితం చేసిన మహనీయుడు పురిపండా అప్పలస్వామి. విశాఖపట్నంలో అఖిలాంధ్రకవుల ఛాయాచిత్ర ప్రదర్శనం ఏర్పాటు చేసిన ఘనత పురిపండాదే.

కవిత్వం ఎవరికోసం రాయాలో, ఎందుకు రాయాలో తెలిస్తే, ఎలా రాయాలో తెలుస్తుంది సామాజిక ప్రగతిశీల భావాలని అక్షరంలో ప్రజ్వలింపజేసిన మానవతా దార్శనికుడు పురిపండా అప్పలస్వామి. తెలుగు సాహితీ చరిత్రలో ఆయన ఎగరేసిన కవితల జెండా మనిషి ఉన్నంతకాలం రెపరెపలాడుతూనే ఉంటుంది. చైతన్యం కలిగిస్తూనే ఉంటుంది.

(2-1-2004న విజయవాడ పుస్తక ప్రదర్శనలో ఏర్పాటు చేసిన పురిపండా అప్పల స్వామి శతజయంతి సభలో చేసిన ప్రసంగ పాఠం) ★



**సభలు - సమావేశాలు**

2004 సంవత్సరపు 17వ 'ఉమ్మడిశెట్టి' సాహితీ అవార్డుకు ఎన్నికైన 'నిషిద్ధాక్షరి' రచయిత్రి మందరపు హైమవతిగారికి ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డును ప్రధానం చేస్తున్న ప్రముఖ కవి, అవార్డు వ్యవస్థాపకులు శ్రీ రాధేయ

కథ

# బలి

- చోడిశెట్టి శ్రీనివాసరావు

కళ్ళు తెరవగానే కనిపించిన పరిసరాలను బట్టి నేను ఆస్పత్రిలో వున్నట్టు అర్థమైంది.

నెమ్మదిగా లేవబోతుంటే 'సెలైన్' ఎక్కుతున్న నాచేతిని నొక్కిపట్టుకున్న అమ్మ లేవొద్దని వారించింది. వారం రోజులపాటు బెడ్మీదినుంచి కదలకూడదని డాక్టరన్నట్టు పవిట చెంగుతో కళ్ళొత్తుకుంటూ చెప్పింది.



"ఇది పగలా....?" సందిగ్ధంగా అమ్మవైపు చూశాను.

"కాదు-రాత్రి. ఇరవై నాలుగు గంటలు గడిచాయి!" అంది అమ్మ.

'ఏంటీ....ఒకరోజంతా స్పృహ లేకుండా నేనీబెడ్ మీదున్నానా!' నమ్మబుద్ధి కాలేదు. కానీ, ఆ మాటచెప్పింది అమ్మగనక నమ్మక తప్పలేదు. చిన్నగా నిట్టూర్చి కళ్ళు మూసుకున్నాను. జరిగిన ప్రమాదం గుర్తుకొచ్చి నా ఒళ్ళు ఝల్లుమంది....

నిన్నరాత్రి.... సమయం పదిగంటలు దాటింది. అమావాస్య కావడంతో చిక్కని చీకటి నలువైపులా కమ్ముకొని వుంది. ఆకాశంలో దట్టంగా పట్టిన మబ్బులవల్ల నక్షత్రాలు కూడా కానరావడంలేదు. వుండుండీ రివ్వున గాలివీస్తోంది.

నా గురువు మూర్తి నడుపుతున్న లారీ నల్లని తారురోడ్డుమీద వేగంగా ముందుకు పరిగెడుతోంది. చల్లగాలికి మెల్లగా నాకళ్ళు మూతపడుతున్నాయి.... ఆయన ఎప్పుడు గమనించాడో "నిద్రపోతున్నావా కిష్టీ! ఊరు దగ్గరపడుతోంది. ఇంకాస్సేపు ఓపిక పట్టు; ఇంటికెళ్ళగానే రెండురోజులపాటు మంచం దిగకుండా నిద్రపోదువులే!" అన్నాడు వేళాకోళంగా.

"లేదు గురూ!..... లేదు...." అంటూనే పెద్దగా ఆవులించాను నేను.

"బావుందిరా..... ఇలా ఆవులిస్తూ-కునుకుతూ వుంటే రేపొద్దున్న లారీ ఎలా నడిపేదుస్తావ్?" కాస్త చిరాకు పడుతూ అన్నాడాయన.

"ఖాళీగా వుండబట్టి నిద్రొస్తుందిగాని లారీ నడిపేటప్పుడు ఎందుకు నిద్రపోతాను గురూ! మొన్న రెండు గంటలపాటు నువ్వు పడుకుంటే నేను లారీ నడిపాను కదా..." అన్నాను నవ్వుతూ.

"ఏమిట్రోయ్, ఇల్లు అలకగానే పండుగ అయిపోయినట్టు మాట్లాడుతున్నావ్... ఈ డ్రైవింగ్లో నువ్వు తెలుసుకోవాల్సింది ఇంకెంతో వుంది. గంటో-రెండు గంటలో లారీ నడిపి గొప్ప ప్రవీణుడివై పోయినట్టు ఫీలైపోకు!" అన్నాడు కోపంగా నాగురువు. నేను కిక్కురు మనలేదు.

"ఏంటోరా నిన్నంటున్నాను కాని నాకే నిద్రముంచుకొచ్చేస్తోంది. ఎప్పుడు ఇల్లుచేరి భార్యా బిడ్డల్ని చూసుకొని పక్కమీద వాలిపోదామా

అనివుంది" అని తనూ ఆవులించాడు.

నిజమే మరి... మేము లారీలో సరుకు వేసుకొని బయలుదేరి, ఒరిస్సాలో అవి చేరాల్సిన వాళ్ళకి చేర్చి తిరుగుముఖం పట్టేసరికి అయిదు రోజులు గడిచిపోయినై. పని గంటలతో నిమిత్తంలేకుండా నిత్యం ఇలా ఊళ్ళు తిరిగే లారీలో క్లీనర్‌గా ఉద్యోగం చెయ్యడం నాకెంత మాత్రం ఇష్టంలేదు. ఈ సారెందుకో ఇంకా బాధనిపించింది.

ఆమాటే గురువుతో అంటే 'నువ్వు పదోతరగతి వెలగబెట్టి ఈ పని చెయ్యడానికి బాధపడిపోతున్నావు. డిగ్రీ చదివి నేనీ డ్రైవింగ్ వృత్తికి అంకితమై పోయానురా!.... అయితే ఎవరు చేసేపనిలో వాళ్ళకేవో సాధక బాధకాలు వుంటూనే వుంటాయి. అంతమాత్రాన చేస్తున్న పనిపట్ల విరక్తి పెంచుకోవడం తప్పు. బతకడానికి ప్రతి మనిషీ ఏదొక పనిచెయ్యక తప్పదుగా. ఈ రోజు క్లీనరే-రేపటి డ్రైవరు కాబట్టి నిన్ను నీవు కించపర్చుకోకు' అంటూ బుజ్జగించాడు. ఉద్యోగం కష్టమే అయినా-ఓనరిచ్చే జీతం తక్కువే అయినా దారిలో ఎక్కిదిగే ప్రయాణీకుల వల్ల డబ్బులు బానే వస్తుంటాయి మాకు.

"గురూ! తిమ్మాపురం వచ్చేశాం" అన్నాను-ఊరు మొగదలనున్న సినిమాహాలునీ, హాలు ముందు టిక్కెట్లకోసం కుమ్ములాడుకుంటున్న జనాన్నీ చూస్తునే.

"అవున్రా... నేను మేలుకునే వున్నాలే.... ఇంద ఆ కిళ్ళీషాపులో ఓ అగ్గిపెట్టె చార్మినార్ సిగరెట్ ప్యాకెట్ తీసుకురా!" అని సినిమాహాలు సమీపంలో లారి ఆపి జేబులోంచి డబ్బులు తీసిచ్చాడు నాగురువు.

నేను గబగబా షాపువద్దకెళ్ళి వాటిని తీసుకొచ్చి ఇచ్చి నాసీట్లో కూర్చున్నాను.

"ఇక పావుగంట ప్రయాణంరా!" అని సిగరెట్ వెలిగించుకొని లారీ స్టార్ట్ చేశాడాయన.

ఒకే ఒక్క నిమిషంలో ఊరుదాటింది లారీ. ఊరితోపాటు వీధిదీపాల కాంతి కూడా దూరమైంది. లారీ హెడ్‌లైట్స్ వెలుగు తప్ప అంతా చీకటిమయంగా ఉంది. మొదటి ఆటసినిమా చూసిన కొంతమంది కుర్రాళ్ళు ఏవో పాటలుపాడుతూ సైకిళ్ళ మీదపోతున్నారు... కొందరు రిక్షావాళ్ళు నలుగురైదుగురు మనుషుల్ని ఎక్కించుకొని తమ శక్తికి మించిన బరువును గమ్యం చేర్చేందుకు ప్రయత్నిస్తున్నారు.

వాళ్ళందరినీ దాటి కాస్తముందుకెళ్ళి కుడిచేతిలో వున్న సిగరెట్ పెదవుల మధ్య పెట్టుకున్నాడు నా గురువు. పొగరాలేనట్టుంది-'వెధవ సిగరెట్ ఆరిపోయిందే' అని తిట్టుకుంటూ స్టీరింగ్ మీదున్న ఎడమచెయ్యి కూడా తీసి సిగరెట్ వెలిగించుకునేందుకు అగ్గిపుల్ల గీశాడు. రివ్వున వీస్తున్న గాలికది ఆరిపోయింది... మళ్ళీ మరో అగ్గిపుల్ల గీశాడు.... సిగరెట్ వెలగలేదు గాని-రోడ్డుమీదున్న గోతిలో పడ్డలారీ మమ్మల్ని ఎత్తికుదేసి-నా గురువు స్టీరింగ్ చేతిలోకి తీసుకునేటంతలోనే అదుపుతప్పి పక్కనున్న పెద్ద చెట్టును గుద్దుకొంది.....

అంతే-ఆ తర్వాత ఏం జరిగిందో.... ఏ పుణ్యాత్ములు మమ్మల్నీ ఆస్పత్రిలో చేర్చి పుణ్యం కట్టుకున్నారో తెలియదు.... ఇంతకీ నా గరువు మూర్తిగారెక్కడ? ఆయనకెలా వుందో?.... గభాలున కళ్ళు తెరిచి అమ్మనడిగాను.

అమ్మ పెదవి విరిచి మౌనంగా ఉండిపోయింది.

అంటే-మూర్తి..... నాగురువు మూర్తి ఇకలేడన్న మాట! అయ్యో, ఎంతదారుణం జరిగిపోయింది?.... లారీ ఆపి సిగరెట్ వెలిగించుకొని వుంటే అసలీ ప్రమాదం సంభవించి వుండేదికాదు గదా.... ఈ వృత్తిలో క్షణకాలమైనా నిర్లక్ష్యం తగదని పదేపదే చెప్పే నా గురువు ఎందుకిలా చేశాడు?.... చెడు అలవాటు మనిషిని జ్ఞాన రహితుణ్ణి చేస్తుందా?.... మొత్తానికి ఆరిపోయిన సిగరెట్ ఆయన నిండుప్రాణాన్ని బలి తీసుకొంది. పొంగుకొస్తున్న దుఃఖాన్ని నేనిక ఆపుకోలేకపోయాను.... ★

# ఆటగదరా శివా !

– రేగులపాటి కిషన్‌రావు

కళాకారులు ధన్యజీవులు, కొందరు ఏదో ఒక కళలో ప్రత్యేకత సంతరించుకుంటారు. కొందరు ఎక్కువ కళలతో ప్రావీణ్యం కలిగి ఉండి కళల ప్రతిభను ప్రదర్శించి పదుగురి ప్రశంసలు పొందుతారు. ప్రతిభ ఉన్న కళా కారులలో ఎన్నదగిన వ్యక్తి తనికెళ్ళ భరణి. అతడు నటుడు మాత్రమే కాదు చక్కని నటుడు. ప్రతి నాయకుని పాత్రలను ప్రతిభావంతంగా నటించి వెండి తెరకు వెలుగు జిలుగులు పంచుతున్న విలక్షణమైన విశిష్ట నటుడు. మెచ్చదగిన వ్యక్తిత్వం, సంస్కారం ఉన్నవ్యక్తి.

అతడు మంచి నటుడు మాత్రమే కాదు. మంచి రచయిత కూడా మాటలను పాటలుగా ఆడిస్తూ శివతత్త్వాన్ని వంద ఎనిమిది గీతాలుగా సుందరంగా "ఆటగదరాశివా!" పేరిట ఆంధ్ర పాఠకలోకానికి (అయిదు వేల పూలు) అందించారు. విశ్వవిఖ్యాతి గాంచిన విశిష్ట చిత్రకారుడు, చిత్ర దర్శకుడు శ్రీ బాపు ఈ పుస్తకానికి అర్థవంతమైన సొగసైన చిత్రాన్ని చిత్రించారు.

శబరిమలలో శిఖరం కూలడం, వందల భక్తులు దుర్మరణం చెందడం. ఆ వార్త విన్న వారందరి హృదయాలు బాధతో నిండడం జరిగింది. ఆ వార్త చదివిన తనికెళ్ళ భరణి గారి హృదయం బాధతో నిండిపోయింది కవితా రూపంలో పొంగిపొర్లి ప్రవహించింది. రెండు వందల మంది భక్తులు మరణించడం, ఇరవై రెండు రోజుల్లో భరణి గారి కలం నూటా ఎనిమిది సార్లు విలపించడం. బాధాతప్త హృదయములో ఎదిగిన పదములతో ఆడిన ఆట అదే "ఆటగదరా శివా!" అన్న పుస్తకం ఆవిర్భవించడానికి కారణం అయింది. అదే శివలీల అంటారనుకుంటాను. శివ భక్తులు.

"ఆట గదరా శివా !
ఆట గద కేశవా !!
ఆట గదరా !
నీకు అమ్మతోడు !!!

ఇది తనికెళ్ళ కలం ప్రకటించిన మొదటి ఆట అదే మొదటి పాట ఒక గీతములో గణపతి కథను ఆడించారు. మరొక తత్త్వ గీతికలో కామ దహనమ్ము కథ కనుల ముందు. రూపు కట్టించారు. ఒక గీతములో మార్కండేయ పురాణం మరొక గీతములో భక్త శిరియాళుని కథను కనుల ముందు కదిలింపజేశారు. అద్వైత సిద్ధాంతాన్ని, కుమార సంభవాన్ని, శ్రీ కాళహస్తి మహిమను భక్తుల కష్టాలు, దుష్టులకు వరాలివ్వడాలు వేర్వేరు గీతాల్లో సత్య సుందరంగా సరళ సుందరంగా, శోక రసపూరితంగా గీతికల రచన సాగించారు.

ఇందులో ఒకే ఒక్క గీతం తప్ప అన్నీ నాలుగు పాదాల గీతాలే. అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని స్ఫురింపజేసిన తనికెళ్ళగారు ధన్యులు మాన్యులు. చాలా గీతాల్లో ఒక పాదం "ఆటగదరా శివా !" అని ఉంటే ఇంకొక పాదం 'ఆటగద' లేద 'ఆటనీకు' అని ఉంటుంది. ఇక మిగిలినవి రెండు పాదాలే కదా !

పైన పేర్కొన్న రెండు పాదాలకు మరో రెండు పాదాలు చేర్చి విశిష్టమైన అర్థము ధ్వనించే లాగా చేయగలిగారు రచనా మర్మం తెలిసిన భరణి గారు. గీతానికి సగటున ఇరవై ఎనిమిది అక్షరాలు. వంద ఎనిమిది గీతాలకు సుమారు మూడువేల అక్షరాలు అందులో సగం అక్షరాలు "ఆట గదరా శివా!" "ఆటగద" లేదా "ఆటనీకు" అనే రెండు పాదాలలోని అక్షరాలను ఆట లాగా తీసేస్తే మిగిలే అక్షరాలు

పదిహేను వందలు. ఈ సుమారు పదిహేను వందల అక్షరాలతో ఒక అందమైన అర్థవంతమైన రసవత్తరమైన కావ్యము కావడం అనేది ఆ శివుడు తనికెళ్ళగారి చేత ఆడించిన అక్షరాల ఆట అంటాను. అందుకే ఈ అక్షరాల ఆట ఆశ్చర్యకరం, ఆనందదాయకం, అభినందనీయం అంటున్నాను.

బిడ్డ పుట్టినప్పుడు దురదృష్టవశాత్తు అమ్మ చావడం మనం చూస్తూనే ఉంటాం. విజ్ఞాన శాస్త్రం ఎంత విస్తరించినా, వైద్యశాస్త్రం ఎంత అభివృద్ధి చెందినా ఇప్పటికీ ఇలాంటి చావులను మనం ఆపలేక పోతున్నాము. ఈ భావాన్ని భరణి గారి అక్షరాలలో ఇలా సాగింది గీతం

**"ఆట గదరా నీకు**
**పసి బిట్ట పుట్టుక**
**ఆట గదరా నీకు**
**అమ్మ చావు" ... 64**

మానవులు కోరికలు పెంచుకొంటారు. ఆ కోరికలు తీర్చు కోవడానికి తీవ్రంగా ఆరాట పడుతుంటారు. కాని ఎన్నో కోరికలు నెరవేరకుండానే ఉండి పోతాయి. కోరికలు తీరనప్పుడు ఆ కోరికల మనిషి బాధాతప్తుడవుతాడు. చివరికి వైరాగ్యభావాన్ని కూడా ఆశ్రయిస్తాడు. తనికెళ్ళగారి అక్షరాల వైరాగ్యం ఇలాఉంది.

**"ఆట గద కోరికల**
**కొలిమిలో కాల్చేసి**
**ఇచ్చేవు వైరాగ్య**
**వై భోగము" ... 60**

మూడు కన్నులవాని, అదే శశిధరుని రూపు రేఖల్ని ఒక గీతంలో ఇలా మన ముందు సాక్షాత్కరింప జేశారు.

**"ఆటగదరా నీకు**
**నెత్తిపై నెలవంక**
**ఆట గదరా నీకు**
**నిప్పు బొట్టు"......33**

ఈ లోకంలో జనన మొందిన నరుడు మోదాన్నీ, ఖేదాన్నీ రెండింటినీ అనుభవించడం మనం చూస్తూనే ఉంటాం. ఎంతటి ధనవంతుడైనా ఎంతటి బలవంతుడైనా ఏదో ఒక ఆపదతో విషాదం పాలుకావడం జరుగు తూనే ఉంటుంది గదా !

**"ఆట గదరా నీకు**
**వరద హస్తము నుండి**
**కనకంబు కన్నీరు**
**కలసి జారు" .... 31**

నరనారీ ప్రణయ సంగమాలతో జననాలు జరగడం ఎంత వాస్తవమో, జననమొందినవారు వృద్ధిచెందడం ఎంత సత్య సమ్మతమైన అంశమో వృద్ధాప్యములోనో, ప్రమాదములోనో, అనారోగ్యం లోనో మనిషి మడిసి పోవడం అంతే సహజం. అదే విషయాన్ని భరణి గారి కలం ఇలా సెలవిచ్చింది.

**"ఆట గదరా జననాలు**
**ఆటగద మరణాలు**
**మధ్యలో ప్రణయాలు**
**ఆట నీకు" ... 25**

మనగోళం మీద, మానవగోళం మీద, ఈ భూగోళం మీద మూడు వంతుల నీరున్నది మిగతా భాగం నేల. కాని ఈ నేల మీద ఉన్న సర్వ ప్రాణులు సుఖ సంతోషాలతో పాటు బాధలు కూడా అనుభవిస్తూ కన్నీళ్ళు కారుస్తూనే ఉన్నాయి. అదే భావాన్ని భరణిగారు పలికించిన విధంబు చూడండి.

**"ఆటగద భూమిపై**
**మూడు వంతుల నీరు**
**మిగతాది కన్నీరు**
**ఆట నీకు" .... 98**

పుడమి మీద ఉద్భ వించిన "ప్రాణులన్నింటిలో గొప్పవాడని కీర్తింప బడేవాడు మానవుడే మనిషికి మాట్లాడే

## క్విట్ ఇండియా డే

9-8-1942న క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైంది. 1857 నాటి సిపాయిల తిరుగుబాటు కన్నా ఇది ప్రమాదకరమైనదని ఆనాటి బ్రిటీష్ పాలకులు భావించారంటే ఈ ఉద్యమ తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. క్విట్ ఇండియా ఉద్యమం బ్రిటీష్ సింహాసనాన్ని కదిలించింది.

శక్తితో పాటు మనో భావాలను అక్షర రూపములో ప్రకటించే నేర్పు కూడా ఉంది. మనుజు లలో కొందరికి మాత్రం సృజన శక్తితో పాటు కవితా శక్తి కూడా ఉంటుంది.

తనికెళ్ళ భరణి గారికి కల్పనా శక్తి ఉంది, కవితా రచన పట్ల ఆసక్తి ఉంది. అల్పాక్షరాలతో అనల్ప భావాలను ప్రకటించే నేర్పు ఉంది. 'ఆటగదరాశివా!' అనే ఈ ముక్తకాల కావ్యాన్ని వ్రాయించి నాజన్మ సార్థక్య మొనరించావని శివునితో అక్షరాలా చెప్పుకొంటున్నాడు.

**"ఆట గద నా జన్మ**
**సార్థక్య మొనరింప**
**అప్పగించిన రచన**
**ఆట నీకు" .... 99**

ఈ అపురూపమైన అద్భుతమైన అందమైన పుస్తకానికి "కొప్పుమీద మల్లె దండ" వలె వేటూరి సుందరరామ మూర్తిగారి అందమైన అక్షరాలమాల ఉంది.

తనికెళ్ళ భరణి కవిత జొన్నవిత్తుల రామలింగేశ్వర రావు గారి మాటల్లో చెప్పవలసి వస్తే ఇలా ఉంది.

**"....................**
**హృదయాన ముద్రించు హృద్యకవిత**
**గుండె లోలోతులో నుండి ఉప్పొంగిన**
**సరసమౌ సరళమౌ సత్య కవిత"**

"ఈ రచనలో కవితా చమత్కృతులూ పుష్కలమే" అన్నారు. సామవేదం షణ్ముఖ శర్మ గారు. శర్మగారి వాక్కు సత్యవాక్కు.

సీతారామశాస్త్రి గారు పల్లవితో పాటు నాలుగు చరణాలు గల ఇరవై ఆరు పాదాలు కలిగిన అందమైన "అన్నమాట" రాసి ఈ గ్రంధాన్ని వెన్నలమయం చేశారు.

సిరివెన్నల పాటల పాదాలను స్పర్శిద్దాం

**"శ్రీవాణి నిన్నెంత కరుణించెరా !**
**శివకార్యగానమౌ స్వరమిచ్చెరా**
**శ్రీ రాణి నీకెంత కలిమిచ్చెరా !**
**శివ చింతనాసక్తి కలిగించెరా"**

ఆంధ్రప్రదేశ్ ఆనాటి అధికార భాషాసంఘం అధ్యక్షులు గౌరవనీయులు మాడుగుల నాగఫణిశర్మగారు అందమైన "ఆశాసనమ్" అందించి పుస్తకానికి సరికొత్త అందాన్ని సంతరింప జేశారు. నాగఫణి గారు ఆ శాసనమ్ ముగింపులో మంగళం కోరేముందు ఇలా అన్నారు.

**"తనికెళ్ళాన్వయ వార్థి చంద్ర !**
**భరణీ ! ధన్యార్థ కావ్యధ్వనీ !"**

"ఆట గదరా శివా !" అనే ఈ పుస్తకములోని ఒకొక్క ముక్తకాన్ని గూర్చి ఎంతైనా రాయవచ్చు. కాని ఆటకు పరిమితి ఉన్నట్టే "ఆటగదరా శివా !" అన్న కావ్యాన్ని గూర్చి వ్రాసే సమీక్షా వ్యాసానికి కూడా పరిమితి ఉండాలి కదా ! ఉంటుంది కదా ! అందుకే శివుడు భరణి గారి కావ్యమును చూపి ఆడించినంతసేపు ఆడాను. ఇక నా అక్షరాల ఆట ముగిస్తాను.

సత్యం శివం సుందరం ★

చిట్టికథ

# కాయలొచ్చె... గింజలొచ్చె...

- వంగరలక్ష్మీకాంత్




నలుగురు పిల్లలు ఆడుకుంటున్నారు. అటుగా చెనక్కాయ బస్తాలతో బండి పోతుంది. పిల్లలు ఆశగా బండివంక చూడసాగారు. బస్తాకున్న బొక్కలోనుంచి ఒక కాయ కిందపడింది. బిల బిల మంటూ పిల్లలు మూగారు. వెతికి కాయను పట్టుకున్నారు. అది ఇత్తనం కాయ, ఊపి చూశాడు. మొగలా "పప్పు నిండుగా ఉంది. కదలటంలేదురా" అన్నాడు ఒకడు "ఏది నేను చెబుతా" అని లాక్కున్నాడు పక్కవాడు, కాయను కాలుకింద పెట్టి పగులగొట్టబోయాడు. "పప్పు చితికి పోతుంది" అన్నారు పిల్లలు.

చేత్తో వత్తాడు. పగల్లా, వరుసగా అందరూ వత్తారు. చెనక్కాయ మాత్రం పగల్లా. ఎవరికి వారు ఆకాయను వాళ్లే తినేయాలని తపించారు. పిల్లల ఆగం భరించలేక విత్తనం అరచే ఉంటుంది. నన్ను బాధ పెట్టవద్దని ఏడ్చేసే ఉంటుంది.

అందరూ చెనక్కాయవంక చూడసాగారు. ఒకరి తరువాత ఒకరు అరచేతిలో పెట్టుకుని క్రిందికి పైకి త్రిప్పిమరీ చూశారు. అంతలో విసురుగా గాలివచ్చి కాయని గోడకేసి కొట్టింది. గింజ తను చితికి పోతానేమోనని గుండె చిక్క బట్టుకుంది. తొక్కు పగిలి గింజ బయట పడింది. పైనుంచి క్రిందికి పడుతుంటే గుండె ఆగినంత వన య్యింది. అంతలో ఒకడి అరచేతిలో పడింది. అమ్మ య్య! దెబ్బ తగల్లేదు. బతికి పోయాను అనుకుంది. నోట్లో ఎగరేనుకో బోయాడు. గాలి మళ్లీ ఊడిసి కొట్టింది. గింజ మట్టిలో పడింది. వెతికి పట్టుకున్నారు. మట్టి తిన్నగింజకదా! మట్టెంగిలి కడగాలని చెంబుతో నీళ్లు తెచ్చి కడగబోయారు. నిజంగానే గింజని మట్టి మింగేసింది. ఎవరికీ కనపడకుండా పోయింది. రోజూవచ్చి వెతకసాగారు మూడోరోజుకల్లా మొలకొచ్చింది. ఆకులేసింది. రెమ్మలేసింది. పెద్దదయ్యి పసుపురంగు పూలు పూసింది. పూలు రాలి మొదట్లో పడ్డాయి. వేర్లు పులకించాయి. పిందె తొడిగాయి. కొన్ని రోజులకి చెట్టు ఎండి పోయింది. పిల్లలు చెట్టు పీకారు. మొదలుకు బోలెడన్నికాయలు.

గింజపోయి మొక్కా వచ్చె డాం... డాం... డాం...
మొక్కాపెరిగి పూలువచ్చె డాం... డాం... డాం...
పూలుపోయె చెట్టుపోయె డాం... డాం... డాం...
కాయలొచ్చె గింజలొచ్చె డాం...డాం.. డాం...

అంటూ పాట పాడుతూ చెనక్కాయల్ని తంపట పెట్టుకుని తిన్నారు. ★

# మధ్యయుగంలో వర్ధిల్లిన వాణిజ్యకులాలు

- డా॥ జి.వి. పూర్ణచంద్

క్రీ.శ. 1071-1120 మధ్యయుగంలో ఆంధ్రదేశం కుళోత్తుంగ చోళుడి పాలనాకాలం. ఉత్పత్తి పెరిగి, కొత్తకొత్త ఉత్పత్తులు అనుభవంలోకి వచ్చి వాణిజ్య అవకాశాలు సమకూరినదశలోకి సమాజం పరిణమించింది. అందుకు తగ్గట్టుగా పట్టణ నాగరికత పెరిగింది. రాజ్యాలు పెరిగాయి రాజులు పెరిగారు. జనాభాకూడా పెరిగింది.. వీటన్నింటి ప్రభావం వెయ్యేళ్ళక్రితం ఆంధ్రదేశంలో వాణిజ్యపరంగా కులవ్యవస్థ పైన గణనీయంగా ప్రసరించాయి వాణిజ్యపరమైన అంశాల ప్రభావంతో సమకూరిన కొన్ని కులాల గురించి మాత్రమే ఇక్కడ ప్రస్తావించడం జరుగుతోంది.

1. చాళుక్య చోళులు పాలించిన 10-11 శతాబ్దాల కాలంలో పిఠాపురం, రాజమండ్రి, విశాఖపట్టణం, పెనుగొండ, బెజవాడ, బాపట్ల, చందోలు, గుంటూరు, ఘంటశాల, నాదెండ్ల... ఇవన్నీ వాణిజ్యకేంద్రాలుగా వాసి కెక్కాయి. విశాఖపట్టణానికి "కుళోత్తుంగ చోళ పట్టణం" అనిపేరుండేది. "మధ్యమకళింగ" గా ప్రసిద్ధమైన దివిసీమలో "ఘంటశాల" ని చోళపాండ్యపురం అనే వారు. రాజమండ్రిదగ్గర మోటుపల్లి ఓడరేవుకు "దేశ్యయక్కొండ పట్టణం" అనే పేరుకూడా వుండేది. ఆరోజుల్లో బెజవాడని రాజేంద్రచోళపురం అనేవాళ్ళు.

2. కాకతీయుల కాలానికి ఓరుగల్లు, అనుమకొండ, చేబ్రోలు, యనమదల, తంగెడ, త్రిపురాంతకం, మాచెర్ల ఇవన్నీ ప్రసిద్ధిలోకి వచ్చాయి.

3. రెడ్డిరాజులకాలంలో కొండవీడు, వినుకొండ, బెల్లంకొండ, కొండపల్లి, నాగార్జునకొండ, అద్దంకి, ఉదయగిరికోట, నల్లూరు, మారెళ్ళ, కందుకూరు, కావలి, పొదలి... ఇవి వాణిజ్య కేంద్రాలుగా ఒక వెలుగు వెలిగాయి. కొండవీడులో అవచి తిప్పయ్య శెట్టి వ్యాపార దక్షత గురించి శ్రీనాధుడు చాలా వర్ణించాడు.

ఇలా అనేక యుగాలలో అనేక కొత్త వ్యాపార పట్టణాలు అవతరించాయి. కొత్తవ్యాపారాలు వర్ధిల్లాయి. విదేశీ ఎగుమతులూ దిగుమతులుకూడ బాగా జరిగాయి. కొన్ని కొన్ని వృత్తి వ్యాపారాలకు కొన్ని కులాలు పెట్టిన పేరయ్యాయి.

అలా ప్రసిద్ధిచెందిన కులాలలో శిల్పకారుల కులాలుగా చెప్పుకొనే ఐదు కులాలు ముఖ్యమైనవి. వీటిని ఆర్టిజాన్ కమ్యూనిటీ అంటారు. కుమ్మరి (Black Smithy) వడ్రంగి (Carpentry) వడ్లవారు- వడ్రోళ్ళు- శిల్పకారులు (Stone Carving) కంచర (లోహపనివారు) Matal Workers కంసాలి (స్వర్ణకారులు) Juwellery ఈ ఐదుకులాలవారు తమని విశ్వకర్మ సంతతిగానూ, విశ్వకర్మకుగల ఐదు ముఖాలకూ ఐదుకులాలూ సంకేతంగానూ భావిస్తారు. అందుకే, వీరికి "పంచానన" కుల స్తులుగా ప్రసిద్ధి ఏర్పడింది. కులోత్తుంగ చోళుడు ఒక శాసనం ద్వారా వీరికి బ్రాహ్మణులతో సమానమైన ప్రతిపత్తిని (సోషల్ స్టేటస్) కల్పించినట్లు చరిత్ర కారులు పేర్కొంటారు.

ఒక వృత్తిలోని వారంతా ఒక కులంగా ఏర్పడడం సహజ పరిణామం ఈ కులాలలో వర్తక వాణిజ్య వేత్తలకు ఒక సంఘం ఉండేది. ఆ సంఘాన్ని "శ్రేణి" అనీ "పఖండి" అనీ "నిగమ" అనీ పిలిచేవాళ్ళు 'ట్రేడర్స్ గిల్డ్' లాంటివి ఇవి.

శ్రేణిలో సభ్యులమీద "శ్రేణి' కి పూర్తి అధికారాలుండేవి. సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకునే అధికారాలు కూడా వుండేవి. ధర్మశిక శ్రేణి, కారాకారశ్రేణి, తెగుకారశ్రేణి... ఇలాంటి పేర్లుకూడ గొన్ని పురాతన గ్రంధాల్లో కన్పిస్తాయి. ఈశ్రేణులు నిర్ణయాలు తీసుకోవడానికి జరిపే అసెంబ్లీని 'నిగమసభ' అనేవారు.

వ్యాపారి లేదా ఉత్పత్తి దారుడు తన కులానికి చెందిన శ్రేణిలో తన పేరు రిజిష్టర్ చేయించు

కునేవాడు. ఈ శ్రేణుల నిర్ణయాలకు ప్రభువులు కూడా, బద్ధులుగా వుండేవారు నిర్ణయాల్ని 'సమయు' అని నిర్ణయించడాన్ని 'సమయ కార్యం' అనికూడా అనేవాళ్ళు ఇవన్నీ స్వయం నిర్ణయాధికారం కల్గిన వాణిజ్య సంఘాలు. వీటి నిర్ణయాలనికి సభ్యులు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే "సమ్యద వ్యతికరణానికి శిక్ష వుండేది.

"శ్రేణ్యా నానా జాతినమ్ ఏకజాతీయ కర్మోపజీవనమ్ సంఘతః ఏకపాణ్య శిల్పోప జీవినః శ్రేణ్యాః" అనే సూత్రంలోని ఒక శ్రేణిలో వివిధ కులాల వాళ్ళుకూడా వుండే వారనే అర్థం కన్పిస్తోంది.

క్రీ.శ. 1071-1120 మధ్యకాలంలో వేంగిని పాలించిన చాళుక్య చోళరాజు తెలికి కులస్థులకు తన రాజ్యంలో ఆశ్రయంకల్పించి, వాళ్ళని బెజవాడకు స్థానికపాలకులుగా నియమించాడు. తెలికి కులస్థులు మౌలికంగా నూనె వ్యాపారులు. వీళ్ళు అయోధ్యనుంచి వచ్చిన క్షత్రియులుగా తమని చెప్పుకున్నారు.

1084 లో రాజరాజ చోళ నరేంద్రుడు ఈ తెలికి శెట్లకు అనేకదానాలు ఇచ్చినట్లు శాసనాలున్నాయి. "తెలుకుల సెట్లు" అనికూడా పిలిచేవాళ్ళు వీళ్ళని. పెదవేణి, నిడదవోలు, తటికలపూడి, బెజవాడలలో - నువ్వుల నుంచి నూనెని పిండే పరిశ్రమలు వీళ్లకుండేవి. శెట్టి అంటే "చీఫ్" అని ! ఈ తెలికి శెట్లు విజయరాయ, జననాథపురి, ధనంజయపురి, భోగవతి, తడువాయి, చింతలపూడి, కొత్తవరం, సాకేత పాంచాల పురవరము, మధురయత్రపురం, మణికారణీకం.. ఈమొదలైన పురాలకు మేయర్లుగా బాధ్యతలు నెరవేర్చే వారని అంటారు.

'తెలికి కవులు చేసిన సమయం' అంటే తెలికికుల పెద్దలు చేసిన నిర్ణయానికి తిరుగులేదని అర్థం.

**శంకరంబాడి సుందరాచారి**

1942లో 'దీనబంధు'అనే చలన చిత్రంకోసం "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" అనే పాటను వ్రాసిన శ్రీ శంకరంబాడి సుందరాచారి ఆగష్టు 10, 1914వ సం॥లో చిత్తూరు జిల్లాలో జన్మించారు. 'ఆంధ్ర పత్రిక'లో కొంతకాలం పనిచేసిన ఈయన ఉపాధ్యాయుడుగాను, పాఠశాలల తనిఖీ అధికారిగాను పనిచేశారు. శ్రీ వెంకటేశ్వరా విశ్వ విద్యాలయం వారు వీరికి "ప్రసన్న కవి" అని బిరుదునిచ్చారు.

బలంజలు లేక బలిజ కులస్థులు కూడా మధ్యయుగంలో చాలా శక్తిమంతమైన వాణిజ్యవేత్తలే! వణిజశబ్దమే ఈకుల నామానికి మూలం. "వీరబలంజధర్మ ప్రతిపాలనలు" అంటే బలిజారుల శ్రేణులు చేసిన తీర్మానాలు చాలా శక్తి వంతమైనదని అర్థం. దాన్ని అతిక్రమించి ఆ కులస్థులు గానీ ప్రభువులు గానీ వెళ్ళేవారు కాదు. కాకతీయుల కాలం నుంచీ, విజయనగర రాజుల కాలందాకా వీరి 'ప్రశస్తి' కన్పిస్తుంది.

పంచానన కులాల వారికి నాగార్జున సాగరం దగ్గరి పెందోట ముఖ్య కేంద్రస్థానంగా వుండేది. బహుశా ఇప్పుడాపట్టణం కనుమరుగయినట్లుంది. వీళ్లు 74 మంది గోత్రీకులున్నట్లు చెప్పుకొన్నారు. విశ్వకర్మని ఆరాధిస్తారు.

వైశ్యులు 102 మంది గోత్రీకులు. కన్యకా పరమేశ్వరి ఆరాధకులు. పెనుగొండ వీరి కార్య క్షేత్రం. పశ్చిమగోదావరి జిల్లా తణుకు దగ్గర పెనుగొండ వుంది.

తెలికి కులస్థులకు మల్లేశ్వరస్వామి ఆరాధ్యదైవం. బెజవాడ కార్యక్షేత్రంగా ఉండేది. "అఖిల దేశాల తెలికి వేవురు" అనడంద్వారా దేశంలో వివిధప్రాంతాలలో తెలికి కులానికి చెందిన వెయ్యిమంది గోత్రీకులున్నారు.

అలాగే బలిజలు గణేశ్వర, గవరేశ్వర దేవుణ్ణి ఆరాధించేవారు. సాతువెళ్ళడం వీరిఅలవాటు. సంచారజీవులు ఎక్కువగా! మధ్యయుగాలలో వాణిజ్యపరమైన అవసరాలు ఇలా కొన్ని కులాలను శక్తివంతమైన కులాలుగా తీర్చిదిద్దాయి. ★

**రచయితలకు విజ్ఞప్తి**

'చినుకు' లో సమీక్షకు
రెండు ప్రతులు పంపడం
తప్పనిసరి.

# పాశ్చాత్యీకరణపై ఎక్కుపెట్టిన బాణం

## "పొగచూరిన ఆకాశం"

డా॥ ద్వా.నా. శాస్త్రి

వచన కవితావైభవానికి "నైనుసైతం" అన్నట్టుగా కలం కదిపిన కవి అద్దేపల్లి రామమోహనరావు. ఈయన నిరంతరకవి. సామాజికకవి. 'గోదావరి నాప్రతిబింబం' అనే కవితా సంపుటి అద్దేపల్లిని ఉత్తమకవిగా నిలబెడుతుంది. అలుపెరుగని కవి కాబట్టి ఈ తరం కవులకంటె ఓ అడుగు ముందుకు వేసి "పొగచూరిన ఆకాశం" అనే కొత్త కవితా సంపుటిని తీసు కొచ్చారు.

**"నువ్వు ఆర్యుడివైతే ఏమిటి? ద్రావిడుడివైతే ఏమిటి?/ బహుళ జాతుల రక్తంనీలో ఇంకి పోతున్న ప్పుడు / నువ్వుమ గాడివైతే ఏమిటి? ఆడదాని వైతే ఏమిటి?/ఇంకోడి మార్కెట్టుకి సరుకు వైపోతు న్నప్పుడు. / నువ్వు మాట్లాడితే ఏమిటి? మౌనంగా ఉంటే ఏమిటి? / పరాయీకరణ భావాలకి మంట పెట్టలేక పోతున్నప్పుడు"**

– ఇవీ ఇవాళ్టి నవాళ్ళు! ఎన్ని ఉద్యమాలైనా రావచ్చు కానీ అసలైన ఉద్యమం రావాల్సి వుంది. అదే సామ్రాజ్య వాద వ్యతిరేక ఉద్యమం! అద్దేపల్లి కవితా లక్ష్యం ఇదే. ఈ లక్ష్యంతో చాలా మంది కవితలు రాశారు. కానీ ఇదే లక్ష్యంతో కొన్ని కవితలు రాసి ఒక సంపుటిగా తీసుకువచ్చిన మొదటి కవిగా అద్దేపల్లిని పేర్కొనవలసివుంది.



**పొగచూరిన ఆకాశం**
**(కవితా సంపుటి)**
**రచయిత**
**డా॥ అద్దేపల్లి రామ్మోహనరావు**
వెల : రూ. **75/-** లు.
ప్రతులకు :
203, శివా రెసిడెన్సి,
దుర్గాభవానీ నగర్,
సంతోష్‌నగర్, హైదరాబాద్.
సెల్: 98491 50303

అద్దేపల్లి రామమోహనరావు వస్తువైవిధ్యానికి ఎంత ప్రాధాన్యం ఇస్తారో అభివ్యక్తి శిల్పానికీ అంత ప్రాధాన్యం ఇస్తారు. ఎందుకంటే విప్లవకవుల్లాగా వస్తువే అతిముఖ్యంకాదు – అభివ్యక్తి కూడా అంతే అతిముఖ్యం. లేకపోతే అది 'స్లోగన్' కవిత్వంగా మారుతుంది. ఈ సంపుటిలో ఉన్న నలభైనాలుగు కవితల్లో వస్తువు దాదాపుగా ఒకటేఅయినా చెప్పేవిధానం వేరు. అభివ్యక్తి శిల్పలోపంవల్లనే అభ్యుదయ, విప్లవ ఉద్యమకవిత్వాలు చాలా వరకు పాడిందేపాటగా మారాయి. అద్దేపల్లికి ఈ నేపథ్యం ఈ స్పృహబాగాతెలుసు. అందుకే అభివ్యక్తికి కూడా ప్రాధాన్యం ఇచ్చారు.

**"శ్రుతిలో అపశ్రుతిని దూర్చిపాడినట్లు / సాత్వికాభి నయంలో బ్రేక్ డాన్సును ముంచి ఆడినట్లు /ఇంట్లో ఓ కాలూ, వాకిట్లో ఓ కాలూపెట్టి / వంతెన కింది వచ్చని గుమ్మాన్ని మరిచి పోయినట్లు/సగం ఇంగ్లీషు, సగంతెలుగు/ తెలుగు వాడినోట్లోంచి గట్లు తెగుతుంది"**

అనడం సరి కొత్త అభివ్యక్తి, మాతృ భాషాభి మానం లేకపోవడాన్ని సము చితమైన ఉపమా నాలతో చెప్పటం ఒక శిల్పం. మొదట్లో ఏంచెబుతున్నారో తెలీకుండా "ఎవరో నన్ను ఈ దారిలోకి విసిరేశారు" అనడం మరోశిల్పం. మన్మథ ఉవాచ.. అని ప్రారంభించడం ఇంకోశిల్పం. ఒక కొత్త ప్రతి పాదనతో కవిత మొదలవుతుందనడానికి ఉదాహరణ **"కవిత్వంకంటే జీవితంగొప్పది"!** ప్రారంభమే కాదు ముగింపు కూడా కవితకి

బలాన్నిస్తుంది. ఇందుకు ఉదాహరణలుగా-

**"అదొక వికృతమైన శరీరవ్యాపారమైపేల్తుంది"**

**"అందుకే లివ్‌గ్లోబల్లీ అండ్ డైలోకల్లీ"** వంటివి పేర్కొనాలి.

చచ్చిపోతున్న ఉత్తరం, సినిమా మాయాజాలం, క్రికెట్ వ్యాపారం, ఐ.టి. జూదం, ఇరాక్‌యుద్ధం.... ఇవన్నీ అద్దేపల్లి కలానికి బలాన్ని చ్చినవే. మనకి కనువిప్పు కలిగించేవే.

**"ఐలవ్ మై ఇండియా, మైఇండియా**
**ఇంగ్లీషు దేశభక్తి ఊపులకి..."**

అన్న అద్దేపల్లితో మనమంతా ఏకీభవిస్తాం. ఇవాళ హిందూఇజమ్ అంటే అమెరికనిజమే అనటం ఎంతసత్యం!! అద్దేపల్లి రాసిన "బుద్దుడూ బూతుబొమ్మలు" అనే కవిత పత్రికలో ప్రచురితమైనపుడు చర్చనీయాంశమై అందర్నీ ఆకట్టుకొంది.

**"వాడుచెట్టుకింద నుంచి, నేలనిలాగేస్తున్నాడు**
**వేళ్ళు కోసేయ్యడానికి కత్తని ఝుళిపిస్తున్నాడు"**

అన్నకవిత. "నాదేశంలో నేనే పరదేశిని" నాకు బాగానచ్చిన కవిత, ఇవన్నీ చదవడం ఒక 'ఎద్యుకేషన్' మనం ఎటువెళ్తున్నామో హెచ్చరిస్తూ మనదిశని మార్గదర్శకం చేస్తున్న కవితా సంపుటిది. 75/-రూపాయలు ఎక్కువనుకుంటే కవికి ఫోను చేసి (9849150303) తగ్గించమనండి. తగ్గిస్తారని నానమ్మకం. చదవండి - ఇదీనా అభ్యర్థన. ★

పేజీ కథ

# పోటీ

- సోమంచి ఉషారాణి



మీడియావాళ్లు ఒకరోజు ఒక కాలేజికి వచ్చారు. ఒక్క నిమిషంలో ఏదైనా విషయం గురించి మాట్లాడించి బాగా చెప్పిన వారికి బహుమతి ఇవ్వడం రివాజు, ఆరోజు ఒక్క ఆంగ్లపదం రాకుండా ఆంగ్లేయుల పరిపాలనా భారతీయుల తిరుగుబాటు గురించి ఎవరికి తెలిసింది వారు చెప్పమన్నారు. మీడియా అనేసరికి ఎవరికి ఆసక్తి ఉండదు? చాలామంది అబ్బాయిలూ, అమ్మాయిలూ గుమికూడారు.

అయితే విషయంవినగానే చాలామంది వెనుకంజ వేశారు. కొంతమంది ప్రయత్నించినా ఏదో ఒక ఆంగ్లపదంరావడం, అందరూ నవ్వడం! అరగంట గడిచినా ఒక్కరూ తెలుగులో ఒక్క నిమిషం ఆంగ్లపదం రాకుండా మాట్లాడలేకపోవడం నిజంగా మీడియావారికి దిగ్భ్రాంతి కలిగించింది.

తెలుగు బోధనా భాషగా కలిగినవారూ, బోధించేవారు కూడా మాట్లాడలేకపోయారంటే ఎవరునమ్మినా, నమ్మక పోయినా నిజం! జనంలో ఎవరో 'మీరు చెప్పగలరా'! అని ప్రశ్నలడిగే మీడియా అమ్మాయి ని అడిగారు. ఆ అమ్మాయి చిన్నగా నవ్వి అనర్గళంగా రెండునిమిషాలు ఒక్క ఆంగ్లప దమూ రాకుండా మాట్లాడింది.

అందరూ చప్పట్లతో అభినందించారు. అయితే తెలుగు భాషకే అవమానంగా భావించి ఆకార్యక్రమాన్ని దూర దర్శన్ వాళ్ళు ప్రసారం చేయలేదు. ఎంత పరభాషా ప్రభావం ఉన్నా మాతృభాషని చిన్నచూపు చూడడం తగదని మీడియా వాళ్ళు తెలుగువారంతా తెలుగే మాట్లాడదాం, తెలుగుభాష తప్పనిసరిగా అన్ని తరగతులకీ ఉండాలని, మన రాజ్యాంగం కూడా తెలుగులోనే నడపాలనీ, తెలుగువారంతా తెలుగులోనే సంతకం పెట్టాలనీ ప్రచారం చేయడం తెలుగువారి దురదృష్టమైతే భాషాభిమానం లేకపోవడం, మన మాతృభాషని సరిగా పలక లేక పోవడం తెలుగుజాతికే అవమానం! తెలుగు తప్పవేరే భాషల్లో పోటీ పడితే మన తెలుగు వాళ్ళకే మొదటి బహుమతి!

"దేశభాషలందు తెలుగులెస్స" అన్న కృష్ణ దేవరాయలు మళ్ళీ పుడితే చివరి అక్షరానికి కొమ్ము తగిలించి; అరె మళ్ళీ ఆంగ్లపదం! అని సొమ్మసిల్లి పోతాడేమో! ★

# నేటి కవితకు అల్లిక నేర్పేకాదు - అల్లిక తీర్పూ కావాలి !

'చినుకు' - సాహిత్య మాస పత్రిక.. ఆగస్టు, 2005

# అణువు

## మినీ కవితల వేదిక

### నిర్వహణ : అశోక్ కుమార్

* మినీ కవిత అభివ్యక్తీ రూపం అణువుతో సమానమైనది. అక్షరం పదునైన పదమై. పదం భావగంభీరమై, మస్తిష్కంలో విస్ఫోటనం చేయిస్తుంది. * మినీ కవిత బహు శక్తివంతమైంది. చిన్నినోటిలో విశ్వదర్శనం చేయిస్తుంది. *దీర్ఘ కవిత అయినా మినీ కవిత అయినా అధిక్షేపన ఒక ఆయుధం. అంకుశం మినీ కవిత ఆయుధం. - నగ్నముని

### జేపీ

పుటక నీది
చావు నీది
బతుకంతా
దేశానిది !

- కీ॥శే॥ కాళోజి

### కెరటం

కెరటం
నా ఆదర్శం.
లేచి పడినందుకు కాదు
పడినా లేచి నందుకు !

- కీ॥శే॥ఆచార్య భావన్

### కొబ్బరాకు

చెట్టున ఉన్నప్పుడు
నెమలి పింఛమై పురి విప్పుతుంది
పండుటాకై రాలి పడినప్పుడు
గుడిసె గుండెల్ని
వెచ్చగా కప్పుతుంది !

- జి. సుబ్బారావు

### రాముడి 'రంగు'

శంభుకుడి వధతో
శ్రీ రాముడు కట్టింది
పర్ణశాల కాదు
'వర్ణ' శాల !

- సశ్రీ

### నే(మే)త

వాడు
నాయకుడయ్యాడు–
అప్పటినుంచి
అన్నం తినడం మానేసి
జ(ధ)నాన్ని తింటున్నాడు !

- డా॥ సాదనాల వెంకటస్వామి నాయుడు

### సామ్రాజ్యవాద ప్రహేళిక

కోతి–రొట్టిముక్క కథలో
వాడు నిజంగా కోతి !
ఇరు దేశాలనూ
పావులుగా వాడుకొని
డబ్బు సంపాదిస్తాడు !
మనల్ని
ఆయుధాల ఉచ్చులో పడేస్తాడు !

- డా॥ ద్వా.నా.శాస్త్రి

## వంతు

అందినంతమేర
కుక్కుకోడానికి
నిన్నటి నా జేబుల్ని
పెద్దవిగా కుట్టించాను
అధికారం వంతులు
మారినప్పుడల్లా
ఇదే తీరు
అప్పుడు వాళ్లూ అంతే !

- దాట్ల దేవదానం రాజు

## పున్నామ నరకం

చచ్చాక వచ్చే
'నరకం' తప్పించుకోడానికి
కూతురొద్దని కోరుకుంటే -

పుట్టిన ఆ 'నా కొడుకు'
బతికుండగానే
నరకం చూపిస్తున్నాడు !

- డా ॥ జి.వి.పూర్ణచంద్

## అనాథ

నేలా నింగీ
తల్లి దండ్రులు !
గాలీ నీరూ
ప్రాణమిత్రులు !
నిప్పు
జ్ఞానమిచ్చే గురువు !
ఎవరూ అనాథలు కారు
పంచ భూతాల సాక్షిగా
అనాథలు లేరు !

- టి. అమూల్య

## రచయిత

నేను వాస్తవాలు రాస్తే
దేశ ద్రోహిని -
మరి, రాయకుంటే
ప్రజాద్రోహినే ?

-వి.వి.డి.యస్.ప్రసాద్

## కేబుల్ 'టీవి'

భారతం బకాసురుడికి
ఇంటికొక్కడే
కోటా !

బుల్లితెర బకాసురుడికి
ఇంటిల్లపాదీ
లూటీ !

- లంకె జనార్ధన్

## ఎన్ కౌంటరు

ఘటనా ఘటన సమర్ధులు
కథాకథన చక్రవర్తులు
నిప్పు లేకుండా
పొగను పోగెయ్యగలరు !
పొగ రాకుండా
నిప్పును రాజెయ్యగలరు !

- దివి కుమార్

## అవతరణ

మెదడునిండా
మెరుపు దాడులు !
నెత్తురోడుతూ
అక్షరాలు
నినాదాలుగా !
ప్రమాదాలుగా !!

- ఎం.బి.జనార్ధన్

## 'సదసత్సంశయం'

రాం రాబర్ట్ రహీం
ఒక్కడని కాదు
ఎక్కడని ?

రాం రాబర్ట్ రహీం
వేరని కాదు
లేరని !

- అశోక్ కుమార్

మినీ కవిత- అక్షరాలు పేర్చడం కాదు-అక్షరాలు పేల్చడం !

# అతడంటాడు




అతడంటాడు
ఏమయితే నాకేమిటీ
ఎవరొస్తే నాకెందుకు
ఎవరు పిలిస్తే నాకేమిటి
ఎవరు మునిగితే నాకెందుకు
ఏది ఎక్కడ మాయమైతే నాకెందుకు
అతడంటాడు
పోనీ
పోతే పోనీ
అన్నీ పోనీ
బ్రిడ్జికూలితే కూలిపోనీ
కాళ్లువిరిగితే విరిగిపోనీ
ఎవరూ మిగలకుండా మరణిస్తే మరణించనీ
చిన్న పిల్లలు రోదిస్తే రోదించనీ
ముసలాళ్లు కొట్టుకుపోతే కొట్టుకపోనీ
ఎవరుంటే వుండనీ
ఎవరు లేకపోతే లేకపోనీ
అతడంటాడు
వాళ్లగురించి నేనెం దుకు బాధపడాలి
వాళ్ల ఇల్లు తగలబడితే నేనెందుకు నీళ్లు చల్లాలి
అతడు పడిపోతే నేనెం దుకు లేపాలి
ఎవరో జబ్బుపడితే నేనెందుకు చూడ్డానికి వెళ్లాలి
వాళ్లకోసం నేనెందుకు ఆలోచించాలి
ఎవరి సమస్యలగురించో నా తలనెందుకు
బాదుకోవాలి.
అతడంటాడు
నాకుటుంబం బాగుంటేచాలు
నా ఉద్యోగం భద్రంగా వుంటేచాలు
నాకు తినడానికి తిండి వుంటేచాలు
నా సంసారం సాఫీగా సాగితేచాలు
అతడంటాడు
అందరూ నాకు సహాయంచేయాలి
అందరూ నా పిల్లల్ని పట్టించుకోవాలి
అందరూ నన్ను చూడ్డానికి రావాలి
అతడంటాడు
ఎవ్వరికీ నేనేమీ పెట్టను
అందరూ నాకే ఇవ్వాలి

– ఆశారాజు

---

## 'ఎక్స్‌రే' అవార్డుకు కవితలు ఆహ్వానం

గత రెండు పుష్కరాలుగా తెలుగు వచన కవితా రంగంలో విశిష్ట స్థానాన్ని పొంది, ఆధునిక యువకవులకు నిరంతర సాహిత్య పాఠశాలగా నిలుస్తున్న 'ఎక్స్‌రే' అఖిల భారత స్థాయిలో వచన కవితలను ఆహ్వానిస్తోంది. ప్రధాన అవార్డుగా ఎంపిక చేయబడిన కవితకు రూ. 2000/- నగదుతో కవికి పురస్కారం, మరో పది కవితలకు ఉత్తమ కవితా పురస్కారాలు ఇవ్వబడతాయి.

కవితా వస్తువు, పరిధి విషయాల్లో కవికి పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. సుదీర్ఘ కవితలు పరిశీలించబడవు. 24వ సంవత్సరం నిర్వహించబడుతున్న ఈ అవార్డుకు కవితలు పంపేవారు విధిగా 'ఎక్స్‌రే' చందాదారులై ఉండాలి. కవితలు ఆగస్టు 31వ తేదీలోగా పంపాలి. డిశెంబరు 25న విజయవాడలో జరిగే ఒక సభలో ఈ అవార్డు బహుకరించబడతాయి.

**కవితలు పంపవలసిన చిరునామా : కొల్లూరి, పి.బి.నెం. 340, విజయవాడ.**

# రెండు కవితలు - రెండు దృక్పధాలు

- తోలేటి జగన్మోహనరావు

మొదటి కవిత

ప్రముఖ స్త్రీవాద కవయిత్రి వసంత కన్నబిరాన్ 'నిరీక్షణ' కవిత.

ఈ కవిత నేపథ్యం గురించి వసంత కన్నబిరాన్ నీలి మేఘాలు పుస్తకంలో ఇలా రాశారు - 'వరవరరావు జైలు నుండి రాసిన లేఖలు ఇంగ్లీషులోకి అనువదించేప్పుడు అతని నిరీక్షణలోని భారాన్ని, అందులోని అర్థాన్ని ఆ అనువాదంలో ప్రవేశ పెట్టడం కోసం నేను ప్రయత్నించేదాన్ని. ఆ సమయంలోనే హేమలత వరవరరావును కలవటానికి జైలుకి వెళ్ళేముందూ, ఒకోప్పుడు కలిసి వచ్చాక మా ఇంటికి వస్తూ ఉండేది. ఆమె వేదన, అతని వేదనలు నా పేగులో చుట్టుకుపోయి ఈ కవిత రాశాను....

ఈ కవిత ప్రముఖ విప్లవ రచయిత వరవరరావు, ఆయన సహచరి హేమలత గార్ల గురించి అని వసంత చెప్పినా సందర్భం విప్లవంలో, ఉద్యమాలలో ఉన్న ఏ దంపతులకైనా వర్తిస్తుంది. ఈ కవితలో వసంత ప్రవేశ పెట్టిన బలమైన స్త్రీ వాద భావాలు హేమలతగారికి ఉన్నాయో లేవో నాకు తెలియదు. అందుచేత ఈ వ్యాసంలో వసంత కవిత గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలు వరవరరావు - హేమలతల వ్యక్తిగత జీవితాలకు సంబంధించినవిగా కాక విప్లవోద్యమంలో ఉన్న భార్యా భర్తల మధ్య సంబంధాల గురించినవిగా చూడాలని మనవి చేస్తున్నాను.

భర్త విప్లవోద్యమంలో ఉన్నాడు. జైలు జీవితం అనుభవిస్తున్నాడు. 'వర్తమానానికి ప్రేక్షకుడిగా, గతానికి గుర్తుగా ఉండి, నడుస్తున్న చరిత్రలో భాగం కాలేక భోజనంకోసం, పత్రికల కోసం, అల్పమైన నిరర్థకమైన విషయాలకోసం నిరీక్షిస్తూ గడుపుతున్నానని జైలులో ఉన్న అతను బాధపడుతుంటాడు. సమాధానంగా ఆమె.

'కానీ ప్రియతమా
నా సుదీర్ఘజీవితం సంగతి ఏమిటి ?
ఈ స్త్రీ, సమయమంతా నిరీక్షణే కదా...' అంటుంది.

నిరీక్షణ అతని గుండెల మీద కెక్కిన కొత్త బరువుకావచ్చు. కాని నిరీక్షణే ఆమె జీవిత విధానం..

నీవు నిద్ర లేస్తావని, స్నానం చేస్తావనీ
భోజనం చేస్తావనీ, బైటికి వెళ్తావనీ
తిరిగి వస్తావనీ, నిద్రపోతావనీ
ఎప్పుడూ నీ గురించే....
పాఠాలు చెప్పి, ఉపన్యాసాలిచ్చీ
ఊరేగింపులు చేసీ, ప్రదర్శనలు నడిపీ
సెమినార్లకు వెళ్ళీ, ప్రయాణాలు చేసీ
వచ్చే నీకోసం 'నిరీక్షణ....'

ఈ స్త్రీ ఎన్నోకలలు కని వివాహం చేసుకుని ఉంటుంది. తన భర్త లెక్చరర్ గానో, డాక్టర్ గానో, ఉద్యోగి గానో, వ్యాపారాల్లోనో సంపాదిస్తూ తనని సుఖ పెడతాడని ఆశిస్తుంది. అలా ఆశించడంలో తప్పులేదు. కాని భర్త... అతన్ని లోకంలో ఉన్న దుర్మార్గం, దోపిడీ కలచివేసింది. ఈ వ్యవస్థను మార్చాలని, సుఖంగా ఉన్న -లేదా సుఖంగా గడపగలిగిన - జీవితం వదులుకుని ఈ ఆధునిక గౌతముడు అందరూ సుఖపడే ఒక వ్యవస్థ నిర్మించాలనే ఆవేశంతో విప్లవంలోకి దూకాడు. తన వెంట తన యశోధరను కూడా కష్టాల సుడిగుండం లోకి ఈడ్చుకుపోయాడు.

తన అభిప్రాయాలతో, విశ్వాసాలతో నిమిత్తం లేకుండా భార్యగా భర్త మార్గంలో నడవాల్సిన పరిస్థితి ఆమెకు ఏర్పడింది. ....నీ నుండి వేరుగా నాకొక ప్రత్యేక మైన ఉనికి లేదు...' కనుక అతని నీడలాగే మనుగడ సాగిస్తున్న ఆమె, పాతి వ్రత్యంతోనో, స్త్రీ హృదయానికీ, ప్రేమకీ బందీ కనుకనో, గత్యంతరం లేకో రాముడు వెంట సీత అడవికి నడిచినట్లు అతని వెంట కంటక మార్గంలో

నడుస్తోందే కాని ఆమెకు భర్త చేసే విముక్తి పోరాటం పట్ల సానుభూతి లేదు. ఆమె 'ప్రపంచానికి రెండు ముఖాలతో కనిపిస్తోంది'. వైవాహిక జీవితంలో 'కత్తిమీద సామే చేసింది. 'భ్రమలలో, కపటమైన కలల్లో బ్రతుకుతున్న' ఈ బ్రతుకుకు సెలవుచెప్పి తన మార్గాన్ని తాను నిర్ణయించుకునే స్వేచ్ఛ కోసం తహతహలాడుతోంది.

**"స్వేచ్ఛ లేని జీవితం కంటే మరణమే మేలని నీ జైలు జీవితం నీకు నేర్పింది' కానీ......**

**.........'నా జీవితంలో**
**అటువంటి స్వేచ్ఛ లేనే లేదని**
**నీతో నా జీవితం నాకు నేర్పింది....**
**నేను తీసే ఊపిరి**
**నేను వేసే అడుగు**
**నా రక్తనాళ స్పందన**
**అన్నీ నీ అవసరాలకోసమే ఐనప్పుడు**
**నా స్వేచ్ఛకు అర్థం ఏముంది ?**

అని ప్రశ్నిస్తుంది.

భర్త సమాజంలోపీడిత వర్గాల అణచివేతను గురించి మాట్లాడుతుంటే ఆమె అతనితో సహజీవనంలో తను ఎల్లా అణచి వెయ్యబడుతోందో మాట్లాడుతుంది.

**"..... నా నుంచి జీవనసారాన్ని**
**చివరి బొట్టుదాకా తాగేసి**
**చివరకు నా ఊపిరినీ, రక్తాన్నీ పీల్చేసి**
**అసలు నేననేదాన్ని లేనట్లు**
**ప్రవర్తించావు...**
**గడచిన పదేళ్ళలో నిరాశా**
**నిస్పృహల కోరలలో చిక్కిన**
**నా జీవితపు అంచుల నైనా**
**తాకావా ?...**

వ్యవస్థ మనిషికి వేస్తున్న సంకెళ్ళు త్రెంచాలని అతను పోరుతున్నాడు అతను తనకు వేసిన సంకెళ్ళు తెంచుకోవాలని ఆమె ఆకాంక్ష. ఆమెకు కుటుంబాన్నుంచి, కుటుంబం వేసే సంకెళ్ళనుంచి, నిరాశా నిస్పృహల కోరలలో చిక్కిన స్వేచ్ఛలేని జీవితం నుంచి విముక్తి కావాలి. భర్తకి రాజ్యంతో విముక్తి పోరాటం. ఈ స్త్రీకి భర్తతో విముక్తి పోరాటం. నా విముక్తి పోరాటం నాదే కానీ నీ వర్గ పోరాటం నాకేవీ ఒరగ బెట్టేది లేదు అన్నట్లు అతని విప్లవ .. కవితల్లోని వాస్తవికత నా జీవిత సత్యాన్ని ఎన్నడైనా చూడగలుగుతుందా..' అని సంభ్రమంతో ఆమె నిరీక్షిస్తూ ఉంటుంది.

ఇదీ వసంత కన్నబిరాన్ స్త్రీ వాద కవిత 'నిరీక్షణ' విప్లవ సుడిగుండంలో చిక్కుకున్న ఒక స్త్రీ కథ.

ఈ స్త్రీ నిరాశ, నిస్పృహ, వేదన వాస్తవాలు కావా? ఈమె ఆరోపణలు కొట్టి పడెయ్యవచ్చా ? కొట్టి పడెయ్యలేని వాస్తవం. కాని.....

## రెండో కవిత

ఈ రెండో కవిత పై స్త్రీ లాగే విప్లవ సుడి గుండంలో చిక్కుకున్న మరో స్త్రీ కథ.

ఈ కవిత గురించి జన నాట్యమండలి మాటల్లో ..తన భర్త ఈ వ్యవస్థ మారాలని చెప్పి పోరాటంలోకి పోయాడు. ఈ దోపిడి గుండెపై తుపాకి ఎక్కు పెట్టాడు. ఆ భర్త పోయిన తర్వాత ఇంటి దగ్గర ఉంటూ బాధలు పడ్తున్న ఆ చెల్లెలు ఏమంటున్నది. – బావా ! నీవు పోరాటంలోకి పోయినావు. కాని నా బాధ ఇను. నా బాధలున్నా కూడా అన్నలు అండగున్నరు. నీ బాటలో నేను కూడా వస్తా.

'బావయెూ..! ఒక్కసారి చూసిపోవా...' ఇదీ ఈ గేయం. ఇది వచన కవిత్వం కాదు. గుండెతో వినాల్సిన గేయం. గాయకురాలు తన కంఠస్వరం రక రకాలుగా మార్చి ప్రేమ, బాధ, కన్నీళ్లు, పట్టుదల, ఆవేశం – ఎల్లా వినిపిస్తుందో పాట వింటే తప్ప అర్థంకాదు.

భర్త విప్లవంలోకి పోయిన తర్వాత ఈమె జీవితం ఎల్లా ఉంది ?

'అత్తగారు, తల్లిగారు

### అరవింద యోగి జయంతి

ఇంగ్లండ్‌లో విద్యాభ్యాసం చేసిన ఈయన లాటిన్, ఫ్రెంచి. భాషలు నేర్చుకుని 1893లో ఇండియాకు తిరిగివచ్చి బరోడా సంస్థానంలో చేరిన అరవింద ఘోష్ ఆగష్టు 15, 1872వ సం॥లో జన్మించారు. అనేక ఉన్నత పదవులను అలంకరించిన ఈయన మొదట విప్లవం ద్వారానే స్వతంత్రం సిద్ధిస్తుందని నమ్మినా, చివరికి ఆధ్యాత్మికత వైపు మరలి 'సావిత్రి' 'నిగూఢవేద రహస్యములు' మొదలైన ప్రసిద్ధ గ్రంధాలు రచించారు. వీరు మరణించగా నాలుగు రోజుల వరకు వీరి మృతదేహం నుండి వెలుగు ప్రసరించిందట.

ఎత్తి పొడుపు మాటలంద్రు పోరోడు, పోలీసోడు దొరికందే మోకంద్రు.... అంతేకాదు, గుండ గాళ్ళు, రండ గాళ్ళు ఆమెను వేధిస్తున్నారు. 'ఏమని చెప్పుదు నేను, ఏ కథ చెప్పుదు నేను...' అని బాధపడుతుంది.

**'తిన్నా తినకున్నాగాని, ఉన్నా లేకున్నా గాని,**
**ఇంట్ల ముడుసుకుని ఉందా మంటే,**
**ఉన్న ఇల్లు పోలీసోల్లు నేల కూల్చిపోయినారు**
**బెదిరిపోయిన పక్షుల్లాగా చెల్లా చెదురైనాము.**
**సెట్ల కింద కూర్చున్నాం**
**కట్టుకున్న సంసారంబోయె,**
**కనుకున్న బిడ్డలు పోయిరి,**
**పసలు పాయె, పొలంపాయె, పెంకుటిల్లు పెంటలాయె.....'**

బావయో ! నువ్వు చెయ్యి జాపి అందుకోవా... అంటూ దీనంగా బావకేసి చెయ్యిజూపుతుంది.

నా గుండె నిండా గాయాలే... నిను గుండెకద్దుకుంటా రావా.. నా మనసులున్న మాట చెప్తా, నువ్వు మరువకుండా కలిసిపోవ, ఒక్కసారి చూసిపోవ...' అని ఆశగా అడుగుతుంది.

ఈ స్త్రీ కూడా భర్తకోసం నిరీక్షిస్తుంది.

అయిన పొంచిఉన్న మృత్యువు గురించి ఆమె భయపడుతుంది.

**'నన్ను చూడ మనసు గుంజి,**
**ఎనకముందు చూడకుండా ఊరువట్టి పోతవేమో / వచ్చేప్పుడు, పోయేప్పుడు పోలీసోని కంటపడితే / పట్టపగలు కాల్చి చంపి పసుపు తుడిచి వేస్తరేమో...'**

అని ఎంతో ఆశతో నిరీక్షిస్తున్నా భర్తను పోలీసులు చంపేస్తారేమో అని భయపడి రావద్దు అంటుంది.

ఇంత దయనీయమైన జీవితం గడుపుతున్నా ఆమె విప్లవం మరచిపోదు. అన్నలు స్వర్ణక్కలాంటి త్యాగమూర్తుల కథలు చెప్పి తనకు ధైర్యం చెబుతున్నారనీ ముచ్చట్లన్నీ ఇంటుంటే మనసు నిండి, గుండె మండె.. అని పోరాటం పట్ల తన సానుభూతిని తెలియ జేస్తుంది. **'నువ్వు రాకుంటే మానాయే గాని.. నువ్వు రేడికల్ల ఇడువబోకు....'** అని భర్తకర్తవ్యం గుర్తు చేస్తుంది.

**'కిందమీద పడుతుంట,**
**కూలికిపోయి నాలికిపోయి**
**కలోగంజి తాగుకుంట కాలమెల్ల తీస్తున్నాం....**
**బావయో ! ఎట్లాగట్ల బతుకుతాము....**
**నువ్వుచింత చెంది చెదిరిపోకు..'** అని భర్తకు ధైర్యం చెబుతుంది. అతనికి ధైర్యం చెప్పడమే కాదు, .....
**'నీ బందూకుంటే ఇచ్చిపోవా.../నీ తోడుగుంట తోల్కపోవ...'** అని భర్త చేతులు కలిపి వ్యవస్థ మీద తిరుగుబాటు చెయ్యడానికి సంసిద్ధురాలవుతుంది

ఈ రెండు కవితలూ ఒకే రకమైన సమస్యని ఎదుర్కొంటున్న ఇద్దరి స్త్రీల గురించిన కవితలు. ఈ ఇద్దరు స్త్రీలు రెండు వర్గాలకు చెందిన వారు. స్త్రీలందరూ ఒకటి కాదు. మగవారిలాగే స్త్రీలు కూడా వివిధ వర్గాలకు చెంది ఉంటారు. వివిధ వర్గాలకు చెందిన స్త్రీల ప్రయోజనాలు, అవసరాలు, సమస్యలు వాటి ప్రాధాన్యతలు, పరిష్కారాలు వేరు వేరుగా ఉంటాయి.

వసంత కవితలోని స్త్రీ ఆర్థికంగా లోటులేని వర్గానికి చెందిన స్త్రీ. ఈమెకు కాని, ఈమె భర్తకు కాని నిజానికి విప్లవం అవసరం లేదు. ఆమె భర్తకు విప్లవం ఒక ఆదర్శం. ఆమెకు ఆ ఆదర్శమూ లేదు సమాజంలో మౌలికమైన మార్పులు తెచ్చే విప్లవం లేకుండానే వీరిద్దరూ జీవితం వెళ్ళదీయగలరు. కొంచెం చలాకీగా ఉంటే పైకి ఎగబాకనూగలరు. భర్త జెయిలు పాలైనప్పుడు తన ఏకాకితనం, నిరీక్షణ నిరాశ నిస్పృహ, స్వేచ్ఛ లేని జీవితం గురించే

**వరల్డ్ ఫొటోగ్రఫీ డే**

ఫొటో అంటే కాంతి. గ్రఫీ అంటే రాత. ఫొటోగ్రఫీ అంటే కాంతితో రాయటం. 1550లో కుంభాకార కటకం సహాయంతో కెమెరాను ఉపయోగించే వారట. ఈ లెన్స్ ద్వారా ఏర్పడ్డ ప్రతిరూపానికి శాశ్వతత్వం కల్పించడానికి అనేక రసాయనాలతో శాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనలు 1827లో ఫలించాయి. లూయిస్ జాక్స్ వాండ్ డాగ్గర్ అనే బ్రిటిష్ శాస్త్రవేత్త, హెన్రీ ఫాక్స్ టాల్ బాట్‌ల కృషి ఫలితంగా ఆధునిక ఫొటోగ్రఫీ ఆవిర్భవించింది.

మాట్లాడుతుంది కాని తను ఎలా బ్రతకాలి, పిల్లలని ఎల్లా పెంచాలి,రేపు ఎల్లా గడుస్తుంది అన్న భయం ఆమెకు లేవు. స్త్రీ స్వేచ్ఛకు నిజమైన ఆటంకమైన ఆర్థిక సంబంధాలను నిర్మూలించడానికి అతను పోరాడుతున్నాడనీ, ఈ మహత్తర పోరాటం తనలాంటి స్త్రీల విముక్తిపోరాటం కూడానని, ఈ పోరాటం ద్వారానే స్త్రీకి నిజమైన స్వేచ్ఛ దొరుకుతుందీ అనే స్పృహ ఆమెకు లేదు. కూపస్థ మండూకలంగా కుటుంబ పరిధి దాటకుండా స్వేచ్ఛ లేని తన జీవితం గురించి దు:ఖిస్తూ, భర్తను నిందిస్తూ అతన్ని విప్లవపథం నుంచి దిగలాగడానికి ప్రయత్నిస్తుంది.

వసంత విప్లవోద్యమంలో చిక్కుకున్న స్త్రీ ఆర్థిక ఇబ్బందులను గురించి, రాజ్య హింస గురించి మాట్లాడరు. దానికి కారణం ఉంది. రెండో స్త్రీ లాగా మొదటి స్త్రీ కూడా దారిద్ర్యపు కోరలలో చిక్కి నలిగిపోతున్నదని చెబితే,పోలీసులు, గూండాలు ఆమెను అవమానిస్తూ వేధిస్తున్నారని చెబితే, భర్తకూ, కుటుంబానికి వెలుపల ఉన్న రాజకీయార్థిక వ్యవస్థ ఈ బాధలకు ప్రధాన కారణంగా పాఠకులు గుర్తిస్తారు. పాఠకుల సానుభూతి నిరీక్షణలో నలిగిపోతున్న స్త్రీ మీద నుంచి అందరి మంచి కోసం బలైపోతున్న ఆ స్త్రీ పురుషులిద్దరి మీదకు మళ్ళుతుంది. వారి ఆగ్రహం ఈ ఇద్దరినీ హింసల పాలు చేస్తున్న రాజ్యం మీదకు మళ్ళుతుంది. అప్పుడు రాజ్య హింస స్థానంలో కుటుంబ హింస గురించి మాట్లాడడానికీ, మగవాడిని ప్రధాన దోషిగా నిలబెట్టడానికి వసంతకు వీలుపడదు. అందుచేత ఆమె మనిషి జీవితంలో అత్యంత ప్రముఖ పాత్ర వహించే ఆర్థికాంశాన్ని పూర్తిగా విస్మరించి పురుషాధిక్యతను, కుటుంభ హింసను చిత్రించారు. ఇది యాదృచ్ఛికం కాదు. ఈ స్త్రీవాదం స్త్రీలను వర్గ పోరాటాలనుంచి తప్పుదారి పట్టించడానికి ఉద్దేశించబడ్డదే కాని వారిలో వర్గ చైతన్యం కలుగజేసేది కాదు.

రెండో కవిత శ్రామిక వర్గ చైతన్యం మూర్తీభ వించిన కవిత. ఈ స్త్రీ కూడా పురుష స్వామ్య వ్యవస్థలోనే జీవిస్తోంది. కానీ ఈ స్త్రీ కష్టాలు, పడకగదికి, వంటింటికి, పైటలకు మాత్రమే పరిమితమైనవి కావు. ఈ స్త్రీ బ్రతుకంతా ఉపవాసాల శివరాత్రే, వెలుగులేని అమవాసే. ఈ స్త్రీ కష్టాలు మౌలికమైన కూడూ, గూడికి సంబంధించినవి. ఆకలి, లేమి ఆమె ప్రధాన సమస్య. పెట్టీ బూర్జువా, ధనిక వర్గానికి చెందిన స్త్రీలకు కూడు నీడా ప్రధాన సమస్యలుకావు. వీరికి స్వేచ్ఛ, ఆత్మ గౌరవం, సమానత్వం లాంటివి ప్రధాన సమస్యలు. ధన స్వామ్య వ్యవస్థతో వీరికి సంఘర్షణ లేదు. వీరిలో కొంతమంది ఆ ధన స్వామ్య వ్యవస్థలో భాగస్తులుగా కూడా ఉంటారు. వీరి సంఘర్షణ ప్రధానంగా పురుష స్వామ్య వ్యవస్థతోనే. శ్రామిక వర్గ స్త్రీకి స్వేచ్ఛ, ఆత్మ గౌరవం కూడా ఆర్థిక వ్యవస్థకు సంబంధించినవి. దారిద్ర్యాన్నుంచి విముక్తిలేకుండా, అవమానకరమైన, హీనమైన జీవితం మారకుండా తనకు స్వేచ్ఛ, ఆత్మ గౌరవం ఉండవని ఆమె అనుభవం ద్వారా గ్రహిస్తుంది. ఇది భర్త పోరాటం మాత్రమే కాదు. తన పోరాటం కూడా అనే స్పృహ ఆమెకు ఉంది. అందుకనే ఆమె తన విల్లును పురుషస్వామ్య వ్యవస్థమీద కాక ధనస్వామ్య వ్యవస్థ మీదెక్కు పెడుతుంది. వసంత కవితలోని స్త్రీలా తన ఒంటరి జీవితం గురించి, సుదీర్ఘ నిరీక్షణ గురించీ, అతను ఎన్నుకున్న మార్గం తనను ఎన్ని కష్టాల పాలు చేస్తున్నదీ చెప్పి, నిందించి, భర్తను వివశుణ్ణి చేసి పోరాటమార్గంనుంచి దిగలాగాలని ప్రయత్నిం చదు.

'రోజూ గింత నచ్చేకంటే, రోత బతుకు బతికేకంటే అమరులైన అన్నలబాట, కూలినాలిబతుకు బాట అంటూ తనూ పోరాటంలోకి దిగుతానంటుంది. ఈ విప్లవం శ్రామిక వర్గానికి చెందినది. శ్రామిక వర్గ స్త్రీలకు చెందినది. అందుకనే ఈ వర్గానికి చెందిన స్త్రీలు తమ మగవారితో పాటు తుపాకీ అందుకుని పోరాడుతున్నారు. చిత్రహింసలకు గురువుతున్నారు. ఎన్ కౌంటర్లకు బలైపోతున్నారు.స్త్రీలు విస్తారంగా పాల్గోకుండా ఏ విప్లవం విజయం సాధించదు. త్యాగం లేకుండా

విప్లవాలుండవు. విప్లవాలు లేకుండా విముక్తి లేదు.

**"లక్ష నక్షత్రాలు రాలితే కాని ఉజ్వల ఉదయం ప్రవహించదు"** అన్నారు ఒక కవి గారు. ఈ చీకటి రాత్రి అంతమై ఉషోదయం కావాలంటే లక్షల నక్షత్రాలు రాలి, వాటి రక్తంలో తూరుపు ఎర్రబడాలి ఈ క్రమంలో ఆకాశంలోసగం నుంచి కూడా లక్షల నక్షత్రాలు రాలుతాయి. కుటుంబాలు విచ్ఛిన్నమవుతాయి. స్త్రీలు, పురుషులు, పిల్లలు, వృద్ధులు - అందరూ దారుణమైన రాజ్య హింసకుగురవుతారు. విప్లవం ఈటీవిలో వచ్చ 'శ్రీమతి భాగ్యశ్రీ' లాంటి కులాసా కార్యక్రమం కాదు. స్త్రీలకు వేదన లేకుండా విప్లవోద్యమాలు సాగుతాయన్న భ్రమ వసంతకి ఉండవచ్చు కాని శ్రామిక వర్గ స్త్రీకి మాత్రం అటువంటి భ్రమ త్యాగదీక్షతోనే ఆమె ఈ కంటక మార్గంలో నడుస్తోంది. ఈ నిప్పుల ఏరు ఈదడం అందరివల్లా కాదు - ముఖ్యంగా అన్యవర్గాలనుంచి తమది కాని విప్లవోద్యమంలోకి కేవలం సానుభూతితో వచ్చేవారి వల్ల అసలు కాదు. దానికి ఎంతో ధైర్యం, విప్లవంలో విశ్వాసం, నిబద్ధత ఉండాలి. అటువంటిది లేనివారు దూరంగా ఉండి, ప్రజలందరి సౌభాగ్యం కోసం ఈ యజ్ఞంలో తమ జీవితాలను సమిధలుగా అర్పిస్తున్న త్యాగధనులకు చెయ్యెత్తి నమస్కరించాలి కాని విప్లవం లేవనెత్తుతున్న ప్రధాన సమస్యలు విస్మరించి, విప్లవం లోకి దూకిన కుటుంబంలోని స్త్రీ వేదన మాత్రమే చిత్రించి, దానికి ప్రధాన కారణం పురుష స్వామ్య వ్యవస్థ, మగవాడు అనడం దిగజారుడు తత్వాన్ని ప్రబోధించడమే కాదు - వంచన కూడా. ★

---

# పాటకు చిరునామా!

ఆమె
వసంత గానం
కోయిల కూసిన కమ్మని రాగం
శారద వీణా తంత్రీ రూపం
మహతీ మోహన మంజుల గీతం
నర్తించిన ఢమరుక నాదం
సవరించిన మురళీ గాత్రం
పాట ! ఆమె నోట
పాలు తేనెల సాగరం
నారద తుంబర సంగమం
చల్లగ సాగిన తొలకరి జావళి
సన్నగ మ్రోగిన మువ్వల సవ్వడి
ఆమె గళమే మధురవం
ఆమె గానమే నవరసం
ఆమె కోయిల
పాడుతుంది జోలలా
పాటలకోటల రాణి
తేట తేనెల పూబోణి
ఆమే జిక్కి కృష్ణవేణి
పాటకు ; ఆమెరాక ఎరువాక
సఫలమైన జీవితం
రాగ సుధా భరితం
ఆకోయిల మూగబోయింది
వసంతం మాత్రం
నిలువెత్తు నీరాజనం పలుకుతూ
కోయిల పాట కోసం
కొమ్మ కొమ్మకూ తిరుగుతూనే ఉంది

- వై. హెచ్.కె. మోహనరావు

**16-08-2005** తొలితరం సినిమా నేపథ్య గాయని జిక్కి క్రిష్ణవేణి ప్రథమ సంస్మరణ దినోత్సవం సందర్భంగా ఈ నివాళి

# కీట్సు సౌందర్యవాదం-సత్యం శివం సుందరం

- బి.వి. రామిరెడ్డి

Whom Gods Love, die young- అని ఆంగ్లసామెత. దేవుడు ఎవర్ని ప్రేమిస్తాడో వాళ్ళని త్వరగా తనదగ్గరికి తీసుకుంటాడని ఆ సామెతకు అర్థం. ఇది కీట్సు మహాకవికి వర్తిస్తుంది. కేవలం ఇరవై ఆరేళ్ళ వయసుకే ఆంగ్ల సాహిత్యా కాశంలో ధృవతారగా వెలిగిన ఈ కవి ఇంకా జీవించివుంటే మరెంత అద్భుతమైన కవిత్వాన్ని వెలువరించి వుండేవాడో అనిపిస్తుంది, ఆయన కవితల్ని చదివినప్పుడు. ఆయన మిగిలిన కవిత్వమంతా అటుంచి, కేవలం ఆయన రచించన 'గ్రేట్ఓడ్స్' చాలు కీట్సుని ప్రపంచ ఆంగ్లసాహిత్యంలో మహాకవిగా శాశ్వత ఉన్నత స్థానంలో ఉంచేందుకు. మహా ప్రేమికుడు, అన్వేషకుడు కాని ఏ కవీ అత్యున్నత స్థాయి కవిత్వాన్ని రచించి మహాకవి కాలేడు. కీట్సు, బైరన్ మహాకవిలాగే గొప్ప సౌందర్య స్వాప్నికుడు.

కీట్సు రచించిన "దిగ్రేట్ ఓడ్స్"-1) ఓడ్ టు ఎ నైటింగేల్, 2) ఓడ్ ఆన్ ఎ గ్రీషియన్ అర్న్, 3) ఓడ్ టు ఆటమ్ 4) ఓడ్ టు సైకి 5) ఓడ్ ఆన్ మెలాంకొలి. ఈ కవితలలో కీట్సు కవితాసుందరి చేలాంచలాల్ని చుంబించిన అనుభవాల పలవరింతలు వినిపిస్తాయి. ఈ అయిదు కవితలలోను, ముఖ్యంగా 'ఓడ్ ఆన్ ఎ గ్రీషియన్ అర్న్'లో కీట్సు సౌందర్యతత్త్వం ప్రస్ఫుటంగా మనకు కనిపిస్తుంది.

కీట్సు ఒక పర్యాయం, లండన్ నగరంలోని బ్రిటీషు మ్యూజియంను సందర్శించాడు. ఆ సందర్భంగా అక్కడ భద్రపరచబడిన, అందమైన అపురూపమైన ఒక గ్రీకు కూజా లాంటి పాత్రను చూశాడు దానిమీద అద్భుతంగా చిత్రించబడిన మూడు చిత్రాలున్నాయి. ఆ పాత్రమీద ఆ మూడు సుందర చిత్రాలకు ముగ్ధుడై, ఆ చిత్రాల ద్వారా ఆ కళాకారుడు మానవ జీవన సౌందర్యతత్వాన్ని ప్రబోధించిన తీరును కవిత్వీకరించి 'ఓడ్ ఆన్ ఎగ్రీషయన్ అర్న్' కవితను సృజించాడు. వాటిలో మొదటి చిత్రం-ఒక యౌవ్వనవతియైన అతిలోక సుందరిని, యౌవనతపనతో అందుకొనేందుకు విఫలప్రయత్నం చేస్తున్న అందమైన యువకుడు. ఆమె అందదు, పరుగుతీస్తూనేవుంటుంది. ఆ యువకుడు తన వ్యర్థప్రయత్నం మానక ఆమెను అందుకోవాలనే తపనలో అలా వెంటాడుతూనే వుంటాడు.

రెండవచిత్రం-అందంగా అలంకరించుకుని స్త్రీ పురుషులు ఆబాలవృద్ధులందరూ ఊరికి దూరంగా వెలసిన ఎవరో దేవుడికో, దేవతకో, బలిపీఠం దగ్గర మొక్కుబడులు చెల్లించుకునేందుకు మేళతాళాలతో, బాజాభజంత్రీలతో, ఒక ఆవు, ఆవుదూడతో ఊరు ఊరంతా ఊరేగింపుగా తరలివెడుతున్న దృశ్యం. ఆవు ఆకాశానికి మోరనెత్తి అంబారావం చేస్తుంటుంది, అమాయకపు లేగదూడ తల్లిని అనుసరిస్తూవుంటుంది. మరోచిత్రంలో, వసంతాన్నలంకరించుకుంటున్న ప్రకృతి మధ్య ఓ యువకుడు జీవన స్పందనోత్సాహన్ని తన వేణువు పాటద్వారా పరవశంతో ఆలాపిస్తుంటాడు.

అశాశ్వతమైన మానవజీవితంలోని ఆనంద స్పందనని కళాకారుడు తనచిత్రాల ద్వారా శాశ్వతీకరించాడు. వాటికి క్షతిలేదు. జీవితం అశాశ్వతమైంది. మరణం మాత్రమే అనివార్యమైనది. కళాకారుడు అశాశ్వత ఆనందహేలలకి తన చిత్రాల ద్వారా శాశ్వతత్త్వాన్ని ప్రసాదించాడు. కవిత ముగింపులో కీట్సు

"Beauty is truth, truth beauty, thats all
Ye know on earth and all ye need to know"

అంటాడు-సౌందర్యమే శాశ్వతం, శాశ్వతమే సౌందర్యం. నిజమైన సౌందర్యానికి క్షతిలేదు; అది శాశ్వతమైంది. (శివం) అలా కానప్పుడు, అది క్షణికమూ, నశ్వరమూ అయినప్పుడు అది

సౌందర్యంకాదు. భగవంతుడు సృజించిన మానవజీవితమూ, దానికి అనుసంధింపబడిన సౌందర్యమూ ఆనందమూ నశిస్తున్నాయి. కానీ, ఈ అశాశ్వతమైన జీవితంలో కవి, కళాకారుడు తాను చూచిన, విన్న, అనుభవించిన, అనుభూతి చెందిన గొప్ప ఆనంద సంఘటనలను, క్షణాలను కవిత్వం ద్వారా, కళలద్వారా శాశ్వతీకరిస్తున్నాడు. అతను సృజించిన, శాశ్వతీకరించిన ఆకళారూపాలు కాలాన్ని జయించి శాశ్వితంగా నిలిచి, విశ్వసందేశా లనందిస్తున్నాయి. ఆ రూపాలవల్ల, సందేశాలవల్ల ప్రభావితులై కళాకారులు కళాఖండరూపాలను సృజిస్తున్నారు. ఆవిధంగా శాశ్వతమై కళా సౌందర్య రూపాలు మరికొన్ని సౌందర్య కళారూపాల సృష్టికి ఉత్తేజాలౌతున్నాయి. ఆ విధంగా కళాకారుడు, మనిషిగా అశాశ్వతుడైనా అతని కళా సౌందర్య సృజన శాశ్వతమైనది. అదేసత్యం. అది శాశ్వతం కాబట్టి శివం, దానికి క్షతిలేదు కాబట్టి సత్య సుందరం. ఆవిధంగా నిజమైన శాశ్వత సౌందర్యం సత్యం. అది సత్యమూ, శాశ్వతమూ కాబట్టి భగవత్సమానం, అనగా శివం, సత్యమూ శివమూ అయినదే అత్యున్నత సౌందర్యం అనగా సుందరం.

బ్రిటీషు మ్యూజియంలో కీట్సు సందర్శించిన ఆ గ్రీషియన్ కళారూపం ఇంత అద్భుత సౌందర్య సత్యాన్ని సృజించేందుకు ఆ మహాకవిని ప్రేరేపించింది. ఆ గ్రీకు కళారూపాన్ని సృజించిన కళాకారుడూ లేడు, దానివల్ల ప్రేరితుడై అద్భుత కవితా ఖండాన్ని రూపుదిద్దిన కీట్సు మహాకవీ నేడులేడు. అయినా ఆ రెండు కళారూపాలూ ఈ మానవ ప్రపంచంలో శాశ్వతంగా నిలిచిపోయాయి.

భారతీయ సౌందర్యతత్త్వవేత్తలు వేలవసంతాలకు పూర్వమే ప్రవచించిన సత్యం, శివం, సుందరం భావనను ఆంగ్ల యువమహాకవి, సౌందర్య స్వాప్నిక తపస్వి కీట్సు తన 'ఓడ్ ఆన్ ఎ గ్రీషియన్ అర్న్' కవితలో పలవరించాడు. ఇది శివమైన సుందర సత్యం. ★

కవిత

# అహంకారం

'నేను'

అనే భావన

వికటిస్తే...

ఆవిర్భవిస్తుంది

అహంకారం!

అదిక్రమంగా...

మనిషి పతనానికి

ఊపిరి పోసి

అధః పాతాళానికి నెట్టుతుంది!

అందరి ప్రేమకు...

ఆమడ దూరంలో ఉంచి

అభివృద్ధికి

అడ్డంకిగా నిలుస్తుంది!

అందుకే ...

అహంకారాన్ని త్యజించు

అందరికీ ఆత్మీయతను పంచు!

– దాస్యం సేనాధిపతి

# 'బ్రౌన్ శాస్త్రి' డా॥ జానమద్ది

- మండవ శ్రీరామమూర్తి

తెలుగుభాషా సాహిత్యాలు ఆదరణలేని కాలంలో కారణజన్ముడుగా అవతరించి ఆంధ్రసాహిత్య దీపాన్ని ప్రజ్వలింపజేసిన సాహిత్య సముద్ధారకుడు సి.పి. బ్రౌన్.

1820 ఆగస్టు నుండి రెండేళ్ళపాటు కడపలో కలెక్టరుకు సహాయకుడుగా బ్రౌన్ పనిచేశారు. 1824లో మొదటిసారిగా వేమన పేరు విన్నాడు. వెంటనే వివిధ ప్రాంతాల నుండి 15 విభిన్న వ్రాత ప్రతులను తెప్పించుకొన్నాడు. దాదాపు 3వేల పద్యాలను సేకరించి, ఇంగ్లీషులో అనువదించి 1829లో స్వయంగా ముద్రించాడు. వేమన కీర్తితోపాటు తెలుగు సాహిత్య కీర్తిని విదేశాలకు విస్తరింపచేసిన మనిషి బ్రౌన్. ప్రజల నాలుకలపై నడయాడే పలుకు బళ్లను, సామెతలను. చాటువులను కొల్లలుగా సేకరించాడు. కథా కావ్యాలను సముద్ధరించాడు. అనేక శతకాలను సేకరించి పది శతకాలను ముద్రించాడు.

### బ్రౌన్ స్మృతి చిహ్నంగా గ్రంథాలయం

కడపలో బ్రౌన్ నివాసమున్న బంగళాస్థలాన్ని 1976లో కలెక్టరుగావున్న డా॥ పి.ఎల్. సంజీవరెడ్డి స్థల యజమాని సి.కె. సంపత్‌కుమార్ నుండి విరాళంగా సేకరించారు. 1987లో కలెక్టరు జె. హరినారాయణ గ్రంథాలయానికి శంకుస్థాపన చేశారు. 1992లో ఎందరో దాతల సహకారంతో ప్రభుత్వ ఆర్థిక సహాయంతో గ్రంథాలయ నిర్మాణం పూర్తయింది. ప్రముఖ పరిశోధకులు, సంస్థలు, గ్రంథకర్తలు విలువైన గ్రంథాలను విరాళంగా



యిచ్చారు.

2003 నవంబరులో జ్ఞానపీఠ పురస్కార గ్రహీత. రాజ్యసభ సభ్యులు డా॥ సి. నారాయణరెడ్డి రూ. 10 లక్షల నిధులతో డా॥ సి.నా.రె. పరిశోధనా కేంద్రం ప్రారంభింపబడింది. ప్రతిఏటా బ్రౌన్ జయంతిని పురస్కరించుకొని నవంబరు 10వ తేదీన బ్రౌన్ స్మారకోపన్యాసాలు, ప్రముఖ సాహితీ మూర్తులకు సత్కారాలు జరుగుతున్నాయి. గ్రంథాలయానికి కంప్యూటర్, జిరాక్స్, ఫాక్స్ సౌకర్యాలున్నాయి. పరిశోధకులు వుండటానికి నాలుగు విడిది గదులున్నాయి.

గ్రంథాలయం గదులలో ఆంధ్రప్రదేశ్‌లోని సాహితీ వేత్తలు రాజకీయ ప్రముఖుల, గ్రంథాలయ సేవాశ్రయ ఛాయాచిత్రాలు ఎన్నో వున్నాయి.

'గ్రంథాలయం' వెంకటప్పయ్య గారు చెప్పినట్టు "డా॥ జానమద్ది స్వయంకృషి, మంచితనం, సేవాభావం, కార్యదక్షతతో బ్రౌన్ గ్రంథాలయాన్ని ఒక సంస్కృతి కేంద్రంగా తీర్చిదిద్దుతున్నారు."

## బ్రౌన్ గ్రంథాలయం రూపశిల్పి:

నడిచే విజ్ఞాన సర్వస్వం జానమద్ది హనుమచ్ఛాస్త్రి అనంతపురంజిల్లా రాయదుర్గంలో 5-9-1926లో జన్మించారు. తండ్రి సుబ్రహ్మణ్యశాస్త్రి తల్లి జానకమ్మ. వారికి మూడవ సంతానం 'శాస్త్రి'గారు. శాస్త్రిగారు వృత్తిరీత్యా ఇంగ్లీష్ లెక్చరర్ అయినా తెలుగు సాహిత్యంపై ఎనలేని మక్కువ. విద్యాభ్యాసం బళ్లారిలో కూడా జరగటంతో కన్నడ భాషపై అభిమానం, కన్నడిగులంటే ఆదరం. తెలుగు-కన్నడ భాషల సమన్వయంతో 'కస్తూరి లాంటి రచనలు చేశారు.

**బహు గ్రంథకర్త, వక్త**

డా॥ జానమద్ది నిత్య సాహిత్య వ్యాపకుడు. 'మాసీమ కవులు' సుప్రసిద్ధుల జీవిత విశేషాలు' 'భారతరత్న మోక్షగుండం' 'డా॥ బి.ఆర్ అంబేద్కర్' సి.పి. బ్రౌన్, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్. 'వ్యాసభారతి', 'ఎందరో మహానుభావులు'. మొదలైన 25 గ్రంథాలను రచించారు. వివిధ పత్రికల్లో. సంచికలలో మూడువేల తెలుగు-ఇంగ్లీష్ వ్యాసాలు వ్రాశారు. ఆకాశవాణి, దూరదర్శన్ ద్వారా 180కి పైగా ప్రసంగాలు చేశారు.

**సన్మానాలు-పురస్కారాలు**

శ్రీ జానమద్ది సాహితీ-గ్రంథాలయసేవలో చేసిన విశిష్ట కృషికి గుర్తింపుగా దాదాపు నూరు సన్మానాలు పొందారు. అఖిల భారతగ్రంథాలయ మహాసభల సందర్భంగా 1992లో గుంటూరులో 'పద్మశ్రీ' అయ్యంకి వెంకటరమణ్య అవార్డు, సవేరా ఆర్ట్సు 'సాహితీ ప్రపూర్ణ' అవార్డు, అఖిలభారత గ్రంథాలయ వజ్రోత్సవ మహాసభలో (1994 బెంగుళూరు) అవార్డు, 1994లో మన తెలుగు విశ్వ విద్యాలయం ప్రతిభా పురస్కారం (గౌరవ డాక్టరేట్), భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు గారి నుండి పురస్కారం అందుకొన్నారు.

'పద్మభూషణ్', సాహితీవేత్త, మాజీ పార్లమెంట్ (లోక్‌సభ) సభ్యులు డా॥ కొంగర జగ్గయ్య గారు పేర్కొన్నట్టు "జానమద్ది మేధావులు. జాతీయ సంస్కృతిని జీర్ణించుకొన్న విజ్ఞులు. సమాజసేవకు అంకితమైన ఉదాత్తులు. గ్రంథాలయోద్యమాన్ని జీవిత లక్ష్యంగా స్వీకరించారు. గత అయిదు దశాబ్దాలుగా నిరంతరమైన వారి సాహిత్యపిపాస, సేవా అనన్య సామాన్యమైనవి".

**డా॥ మల్లెమాల జేజేలు**

"జ్ఞాన సంపన్నమౌ మానవాభ్యుదయమే
శ్వాసగా ధ్యాసగా బ్రతికెనెవడు?
వివిధాంశములపైన విశ్లేషనాత్మక
వ్యాసముల్ విరివిగా వ్రాసెనెవడు?
అట్టి సద్గుణరాశి మహామనిషి
వినయశీలుడు దారుడు విదితయశుడు
జాతి గర్వించదగిన సౌజన్యమూర్తి
జానమద్దికి జేజేలు వేనవేలు"

— — —

# "తీరం దాటిన దుఃఖం"

ఎన్నిసార్లు
ఇసుకతిన్నెల్లో మమేకమై
కౌగిలించుకు గిలిగింతలాడుకున్నామో
కుక్కపిల్లలా వెంటబడి వస్తోంటే
తుళ్ళి తుళ్ళి ఒళ్ళో వాలి పడ్డానో

చెలికత్తెవనుకున్నా.
తెల్లని నురగలను నమ్మి
దయాపారావతమనుకున్నా
కడుపులో ఇంత విషయం దాపెట్టుకున్న
విషయం
నమ్మికతో కళ్ళు మూసుకుపోయిన నాకు ఎలా
తెలుస్తుంది.

ఇదినాది
అదినాదని
అక్షాంశాలు రేఖాంశాలుగా విభజించుకుంటున్న
నన్ను
ఆకాంక్ష చచ్చేట్టు చేశావు.

నీకు చెప్పిన ఊసులను
అలల దుప్పట్లతో దులిపేసుకున్నావు గదా

నీయభిముఖంగా
మౌనమై నన్ను నేను శోధించుకున్నప్పుడు
పిల్లాడిలా నిదురోయిన నీకు
ఈ రౌడీయిజం ఎవరు నేర్పారు.

పొద్దు కడుపులో పడుతున్నప్పుడు
ముద్దు ముద్దుగా చెప్పుకున్నమాటల్ని
మూటగట్టి ఏ అంతర్లోయల్లో విసిరిపారేశావు.

నా గుండెలోతుల్ని గంభీరంగా పరీక్షించు
ఎంత బాధ అంతరాంతరాల్లో దాగి ఉన్నా
ప్రశాంతతను ఎలా అలవర్చుకోవాలో నీకు
తోస్తుంది

ఎంత అలజడికి లోనైనా
సావాసాన్ని మర్చిపోతావా
సునామీ వస్తేనేమి
నన్ను బినామీని చేస్తావా

చూడు ప్రియతమా!
ఇదేనా శపథం
ఏనాడో ఒకనాడు
నిన్ను జయిస్తాను

నీ మనస్సునూ జయిస్తాను
ఛీ ! అంటే
పోరాటానికైనా సిద్ధమౌతాను
మనిషిని నేను
మరిచిపోకు సుమా!!!

– ఈగ హనుమాన్

## సభలు - సమావేశాలు




ఎక్స్‌రే సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ ఆధ్వర్యంలో జూన్ నెల 19వ తారీఖున విజయవాడ టాగూర్ గ్రంథాలయంలో జరిగిన **ముఖాముఖి** కార్యక్రమములో పాల్గొన్న ప్రముఖ విప్లవకవి, ఉపన్యాసకుడు **శ్రీ జ్వాలాముఖి** గారితో ఆ కార్యక్రమ నిర్వాహకుడు, ప్రముఖ కవి **శ్రీ అశోక్ కుమార్**

కథ

# ఇద్దరూ బిడ్డలే - ఇద్దరికీ తండ్రే - కానీ!

- కందుకూరి వెంకట మహాలక్ష్మి



'ఆ ముసలిదానికి బదులు ఈ ముసిలాడైనా చచ్చాడు కాదు. ఆవిడుంటే యింత కూరా నారా తరిగి, ఏదో వంట చేసిపడేసేది. ఆఫీసునుంచి ఇంటి కొచ్చేసరికి ఈయన గారు కాకిలా కాఫీకోసం నోరెళ్ళ బెట్టుకుని కూర్చుంటాడు. ప్రొద్దున్న పదయ్యేసరికి ఆకలంటూ వంటింటికేసి పదిసార్లు తొంగిచూస్తాడు. చస్తున్నాను ఈ వెధవచాకిరీ చెయ్యలేక నాకీశనివదిలి మంచిరోజులు ఎప్పుడు వస్తాయో!" అంటూ దండకం చదువుతున్న సౌజన్యని చూస్తూ "ఊరుకోవే! నాన్నొచ్చేటైమయింది. వింటే బాగుండదు పెద్దవాడూ - ఏంచేస్తాడూ? బైటనుంచి ఏదోకూర, నార తెచ్చిపడేస్తున్నాడు కదా! పిల్లల్ని బడికి దింపితీసుకొస్తున్నాడు-"

"ఆ-చాలు చాలు మరో రెండేళ్ళు పోతే పిల్లలు వాళ్ళంతట వాళ్ళే బడికి వెళ్ళివస్తారు. కూరలు వాకిట్లోకే వస్తాయి. ఈయన గారికి తిండికయ్యే ఖర్చులో సగం డబ్బుపెడితే ఓ పనివాడొస్తాడు. ఈయన చేసే నిర్వాకం ఏం మండిపోవడంలేదు" అంటూ గట్టిగానే అంటున్న కోడలు సౌజన్య మాటలు విన్న వెంకన్నపంతులు వాకిట్లో అలాగే

నిలబడి పోయాడు. బైటి కొచ్చిన కొడుకు తండ్రిని చూసి తత్తర పాటుతో బైటే నిలబడిపోయావేమిటి నాన్న! మంచినీళ్ళు కావాలా? అంటూగట్టిగానే అనడంతో, ఆ మాటలు విన్న సౌజన్య నోరు కాస్త మూత పడింది.

అన్నంముందు కూర్చున్న వెంకన్న పంతులికి ముద్ద దిగటంలేదు. నాలుగు మెతుకులు తిని చెయ్యికడుక్కుని లేచాడు. పడుకున్నాడేగానీ నిద్రపట్టడంలేదు.

తను చేసింది చిన్న ఉద్యోగమే! ఓ కొడుకూ, కూతురుతో సరిపెట్టుకున్నారు. భార్యాభర్తలిద్దరూ కొడుక్కి పెద్దచదువు చెప్పించారు. కూతురికి పి.యు.సి. చెప్పించి పెళ్ళి సంబంధాలు చూడ సాగారు" నాన్నా నాకిప్పుడే పెళ్ళొద్దు నాన్న! చదువుకుంటాను. డిగ్రీఅన్నా చెయ్యాలనివుంది" అంటూ వేడుకుంటున్న కూతుర్ని. "ఎంత చదివిస్తే అంతంత కట్నాలు పొయ్యాలి తల్లీ! పోనీ కట్నాలు పోసి పెళ్ళి చెయ్యగానే సరా-సారే, చీర, పండగలూ, పబ్బాలూ, పురుళ్ళూ, పుణ్యాలూ, బారసాళ్ళూ-ఇలా ఏదోవకటి వస్తూనే వుంటాయి. ఇవన్నీ అయ్యే సరికి మేము దివాళా తియ్యాల్సిందే! ఏదో పెళ్ళిచేస్తే ఆ చదువు ఖర్చన్నా కలిసొస్తుంది. ఇది మంచి సంబంధమే! ఏదో ఉద్యోగం చేస్తున్నాడు. పెళ్ళాన్ని పోషించుకుంటాడు అంటూ చిరాకుపడి పెళ్ళిచేసారు ఓ గుమస్తాకి యిచ్చి.

చదువుమీద ఆశ చావని ప్రమీల భర్తని ఒప్పించి బి.కాంలో చేరింది. మూడేళ్ళలో బి.కాం. పూర్తిచేసి బ్యాంక్ ఉద్యోగాలకి అప్లైచెయ్య సాగింది. ఓ మంచి బ్యాంక్‌లో ఉద్యోగం సంపాదించి తల్లి, తండ్రులకి తెలియజేసింది. ఆ విషయం విన్న తండ్రిమాత్రం సిగ్గుతో కుచించుకు పోయాడు.

భార్య వట్టుదల, ఉత్సాహంచూసి ప్రమీల భర్త వర్ధన్ కూడా ప్రైయివేటుగా ఎం.బి.యేకి కట్టి కొన్నాళ్ళకి మంచి కంపెనీలో ఉద్యోగం సంపాదించాడు. వీళ్ళిద్దరూ ఉద్యోగాలు చేసుకుం టున్నారు. వాళ్ళకి యిద్దరు పిల్లలు.

అప్పుడప్పుడు వచ్చిపోయే కూతురితో మనసువిప్పి మాట్లాడలేక పోయేవారీదంపతులు. భార్యా, భర్త లిద్దరూ ప్రమీల పుట్టింటి వారేమిచ్చినా ఎంతో నమ్రతతో తిరస్కరించేవారు "అమ్మా అన్నీవున్నాయమ్మా! ఎందుకు మాకుమళ్ళీ పెడతారు? పసుపు కుంకుమా, జాకెట్ బట్టాయివ్వండి చాలు" అంటూ ప్రమీల మర్యాదగా తిరస్కరిస్తుంటే – 'మామయ్య గారూ ఇలాంటి లాంచనాలు నాకుయిష్టముండవు. నేనూ మీ కొడుకులాంటి వాడినే" అని అంటూంటే ఎవరో చెంపమీద చెళ్ళుమని కొట్టినట్లుండేవా మాటలు. తల్లీ తండ్రితో తమింటికొచ్చి కొన్నా ళ్ళుండమని ఎన్నోసార్లు బ్రతిమాలింది. వీళ్ళకే ముఖం చెల్లక కూతురికి చేసిన అన్యాయానికి సిగ్గుపడి పోయేవారు. కూతురు చదువుకుంటానంటే చదువు చెప్పించక పోవడం, ఓ గుమస్తాకిచ్చి పెళ్ళి చెయ్యడం తల్చుకుని సిగ్గుపడేవారు.

కొడుకు సైంటిస్టుగా మంచి ఉద్యోగంలోనే వున్నాడు. కోడలు కూడా ఉద్యోగస్తురాలే! భార్య బ్రతికి ఉన్నన్నాళ్ళూ వంటమనిషీ, పనిమనిషీ అయి ఆ ఇంటికి చాకిరీ చేసింది. రెండు నెలల క్రితం స్వర్గస్తురాలయింది. ఉన్న ఆస్తి అమ్మికొడుకేదో నిర్వాకం చేస్తాడని చదువుచెప్పించాడు. కనీసం ప్రావిడెంట్ ఫండన్నా వుంచుకున్నాడా అంటే ఆ డబ్బూ కొడుక్కేయిచ్చాడు. "నాన్నా పట్నాల్లో ఇల్లద్దెలు చాలా ఎక్కువ నేను ఆఫీసులో కొంతలోను తీసుకుంటాను, నీ ప్రావిడెంట్ ఫండూ, ఆ డబ్బూ కలిపి ఓ ఫ్లాట్ కొనుక్కుందాం". అంటే ఆ డబ్బూ యిచ్చేసాడు.

**డా॥ విక్రమ్ సారాభాయి జయంతి**

"రోదసీ కిరణాలు" అనే అంశం మీద పరిశోధన చేసి 1947లో కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ నుంచి పి.హెచ్.డి పొందిన డా॥ విక్రమ్ సారాభాయి 19-8-1919న అహమ్మదాబాదులో (గుజరాత్) జన్మించారు. అంతరిక్ష పరిశోధనకు ఉపయోగకరంగా "ఫిజికల్ రీసెర్చ్ లాబోరేటరీ"ని నెలకొల్పారు. అహమ్మదాబాదులో వస్త్ర కర్మాగారాల పరిశోధక సంస్థను స్థాపించడంలో కీలక పాత్ర వహించారు. 1966లో "పద్మ భూషణ్' మరణానంతరం 'పద్మ విభూషణ్' బహూకరించబడింది.

భార్యమెడలో పుస్తెలగొలుసూ, జత గాజులూ కోడలికీ, కూతురికీ ఇచ్చాడు. నాకెందుకు నాన్నా బంగారం? వీళ్ళదగ్గరుంటావు, అన్నా, వదినా నిన్ను బాగా చూసుకోవాలి, వాళ్ళకే యియ్యి'' అంటూ ఆ బంగారంకూడా అన్నకూతురి చేతిలో పెట్టింది ప్రమీల.

కూతురాడే ప్రతీమాటా మెత్తని కత్తితో పొడుస్తున్న ట్లుండేది వెంకన్న పంతులికి.

ఇప్పుడు జరిగిందేమిటి? కొడుకు కోడలికి ఎదురు చెప్పలేదు. కోడలు హయాం చెల్లించి వీళ్ళని పనివాళ్ళల్లా చూసేది. అప్పుడప్పుడు అనిపించేది ప్రమీల దగ్గర కెళ్ళి కొన్నాళ్ళు వుందామా! అని కానీ ఏముఖం పెట్టుకుని వెళ్ళగలరు? ఆమె చదువు కుంటానంటే అన్నమాటలు గుర్తొస్తే తల కొట్టేసి నట్లుంటుంది. చిన్న ఉద్యోగస్తుడికిచ్చి పెళ్ళి చేసినా ఏమీమాట్లాడకుండా, ఒక్క రోజూ తమని దెప్పకుండా స్వయంకృషి మీద ఈనాడు భార్యా భర్త లిద్దరూ పెద్ద, పెద్ద ఉద్యోగస్తులయ్యారు. వాళ్ళకేం చేసామని వాళ్ళింటి కెళ్ళగలం! ఒక్కపైసన్నా దాచుకోకుండా వీళ్ళకంతా యిచ్చేసినందుకు ఏమాత్రం విశ్వాసం లేకుండా వీళ్ళున్నారు. తానొకటి తలిస్తే దైవమొకటన్నట్లుంది తన జాతకం తను చదివించిన కొడుకు తన వాడు కాదు. తన డబ్బా పెట్టి కొన్న ఇంటిలో ఒక్క గదికూడా తనది కాదు అంటూ బాధ పడసాగాడు.

రెండు రోజులు శలవలని తండ్రిని చూడాలని వచ్చింది ప్రమీల. కోడలాడిన మాటలు ప్రమీలతో చెప్పుకుని ఏడ్చేసాడు వెంకన్నపంతులు. ఇంత బాధని కడుపులో పెట్టుకుని బాధపడుతున్న తండ్రిని జాలిగా చూసింది. తనతో తీసుకువెళ్తాను రమ్మనగానే "రాలేను తల్లీ! నీకు చేసిన అన్యాయానికి ఏ ముఖం పెట్టుకుని నీ గడపతొక్కాలి? నీకేంచే సాము?" అంటూ బాధపడుతున్న తండ్రిని ఊరడించి, టిక్కెట్టుకొని తండ్రిని తనతో బయలు దేర దీసింది ప్రమీల.

తండ్రికోగది కేటాయిం చింది. వంటమనిషి వంటచేసి తండ్రికి పెట్టేది. సాయంకాలాలు పిల్లల్ని తండ్రినీ కారులో ఎక్కడికో ఓచోటుకి తిప్పిరమ్మని డ్రయివర్నియిచ్చి పంపేవారు. తను పుట్టి ఏనాడూ ఎరుగని సౌఖ్యాలన్నీకూతురింట అనుభ విస్తున్నాడు. కూతురెంత ప్రేమగా చూస్తోంటే అంత బాధగావుంటోంది. ఆ ప్రేమ, అభిమానం కడుపులో ఎవరో చెయ్యిపెట్టి కెలికినట్లుంటోంది. తన పట్ల కనవరుస్తున్న అప్యాయత ములుకుల్లా గుచ్చుకుని బాధిస్తున్నాయి. ఏదో చెప్పలేని సిగ్గు మనసుని పిండేస్తోంది. కోడలాడే మాటలతో ఆమె పెట్టిన తిండి ఎక్కేదికాదు. ఇక్కడ ఆప్యాయంగా పెడుతున్నతిండి గొంతుదిగటంలేదు. పిల్లలకి ఓ ఐస్‌క్రీమ్ కొనివ్వాలన్నా చేతిలో పైసలేదు. ఇలా మనశ్శాంతి లేక అక్కడ వుండలేక పోతున్నాడు. ఆప్యాయంగా పెట్టే తిండికంటే కోడలు చూపే అనాదరణే భరించగలదేమో! అనిపించేదొక్కోసారి.

ఉదయం ఆఫీసుకెళ్తున్న కూతుర్నిచూసి 'అమ్మా ప్రమీలా! నాకుటిక్కెట్టు కొనమ్మా బాబు దగ్గరకి వెళ్తాను" అన్నమాటలకి "వచ్చి వారం రోజులేకదా అయింది నాన్నా! కంగారేమిటి? ఓ నెల్లాళ్ళ న్నావుండు". అంటున్నకూతుర్ని చూసి లేదమ్మా కూతురింట్లో ఎన్నాళ్ళుంటాను! అనగానే అల్లుడు 'అదేమిటి మామయ్యగారూ! మీకు కొడుకొకడూ, అల్లుడొకడూనా? పంపరవాలేదు కొన్నాళ్ళుండండి.' అన్నా వినకుండా "మళ్ళీ వస్తాను లే బాబూ, టిక్కెటు తీసుకురండి" అంటున్న మామగారిని చూసి "సరే డ్రయివర్ని పంపించి తెప్పిస్తాను" అన్నాడు వర్ధన్ .

తండ్రి మనసులోని భావాలని గ్రహించిన

**టంగుటూరి ప్రకాశం పంతులు**

14 సంవత్సరాలు న్యాయవాదిగా పనిచేసిన తర్వాత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, 'స్వరాజ్య' పత్రికను నెలకొల్పి, ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఎన్నికయిన శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు ఆగష్టు 23, 1872వ సం॥లో జన్మించారు. వీరి జన్మస్థలమైన ఒంగోలును ఆయన పేరు మీద ప్రకాశం జిల్లాగా మార్చారు. 'నా జీవిత యాత్ర' అనే పేరుతో మూడు భాగాలుగా స్వీయ చరిత్రను రాసుకున్నారు.

ప్రమీల ఆయన్ని వెళ్ళకుండా ఆపుదామని ప్రయత్నించినా కుదరడం లేదు. తండ్రిని తీసు కొచ్చాక అన్నా, వదినా కనీసం ఓ కార్డన్నా రాయలేదు. అక్కడికి వెళ్తే ఆయన గతి మళ్ళీ మామూలే! అనుకుంది తనే ఫోన్ చేసి అప్పుడప్పుడు అన్నగారితో మాట్లాడి తండ్రి క్షేమం చెప్పేది తప్ప అటునుంచి ఎప్పుడూ కబురుండేదికాదు.

తప్పని సరయి తండ్రికి టిక్కెట్టు కొని తెప్పించారు. వచ్చే ఆదివారానికి టిక్కెట్టు దొరికింది. 70 ఏళ్ళు దాటిన తండ్రిని "ఒక్కడివీ అంత దూరం వెళ్ళగల వానాన్నా!" అనగానే "రైలెక్కుతే అంతా నావాళ్ళేనమ్మా ! " అన్నాడు.

తండ్రి ప్రయాణం గురించి అన్నయ్యకి చెప్పగానే కాస్త కంగారే పడ్డట్టుంది గొంతు కొన్నాళ్ళుంచుకోక పోయావా? ఇక్కడాయనకి మునిగిపోయే పనులేమున్నాయి? కంగారేమిటొచ్చిందాయనకి? ఇక్కడికన్నా అక్కడే ఆయనకి సదుపాయంగా వుంటుంది. కొన్నాళ్ళు పోయాకా పంపిద్దుగాని, కొంపలేం మునగటంలేదు'' అన్న అన్నయ్య మాటలకి ఏమీ అనలేక "ప్రయత్నిస్తానన్నయ్యా!" అనిమాత్రం అంది.

రెండు రోజుల్లో తండ్రి ప్రయాణం సాయంత్రం ఇంటికి వచ్చిన కూతురు "నాన్నా నీ ప్రయాణం ఓ ఏడాదికి వాయిదాపడింది". అనగానే "ఏడాదికా?!" అంటూ తెల్లబోతూ "అదేమిటీ? ఎందుకూ?" అన్నాడు ఆశ్చర్యంగా "అన్నయ్యకి విదేశం వెళ్ళే ఛాన్సు వచ్చిందట. వదినా, పిల్లల్ని కూడా తీసుకెళ్తున్నాడట. కొన్నాళ్ళు నాన్నని నీదగ్గరుంచుకో నాన్నకి ఖర్చులకి డబ్బులు పంపిస్తూ వుంటానని ఫోన్ చేసాడు సో, నీటిక్కెట్టు కేన్సిల్ చేసాము" అంటూ చెప్పగానే శిలలా నిలబడిపోయాడు.

ఇక తప్పక కూతురింట్లో వుంటున్నాడు వెంకన్న పంతులు, నెల నెలా ఓ వెయ్యి రూపాయలు తెచ్చి అన్నయ్య పంపిన డబ్బు అని తండ్రి చేతికిచ్చేది. కొడుకు పంపే డబ్బు చూసాకా ఆయనలో కాస్త మార్పు కనిపెట్టారాదంపతులు. అందులో కొంత డబ్బు కూతురికిచ్చి కూతురి సొమ్ము వూరికే తినకోడదమ్మా!" అనేవాడు 'పోనీలే నాన్న నీ తృప్తి మాకూ ఆనందం' అంటూ ఆ డబ్బు తీసుకునేది. మిగిలిన డబ్బుతో పిల్లలకి అవీయివీ కొని పెట్టేవాడు.

ఇప్పుడు వెంకన్నపంతులులో ఓరకమైన తృప్తి ఆత్మ విశ్వాసమూ కలగసాగాయి. కూతురి సొమ్ము తింటున్నానన్న బెంగతగ్గింది. ఎంతయినా కొడుకుకదా! తండ్రంటే అభిమానం లేకుండా వుంటుందా! డబ్బున్నా పంపిస్తున్నాడు ఆనందంగా హుషారుగా తిరుగుతున్న తండ్రిని చూసి లోలోనే ఆనందపడింది ప్రమీల.

నన్ను క్షమించు నాన్నా! నేను ఎంత తప్పుపని చేస్తున్నానో నీకు తెలియదు. తెలిస్తే నన్ను క్షమించవు. నీలోని అతర్మదనం గ్రహించి అబద్ధం మాడేను నాన్నా! నీ కొడుకు ఫారిన్ వెళ్ళనూలేదు – నీకు డబ్బు పంపడమూలేదు కూతురికి ఏం చెయ్యలేదు, కూతురి సొమ్ము తింటున్నానన్న నీలోని బాధని అర్ధంచేసుకుని, నీ కొడుకు ఫారిన్ వెళ్ళాడనీ నీకు డబ్బుపంపిస్తున్నాడనీ అబద్ధంచెప్పాను. పిచ్చినాన్నా! ఎలాగున్నావని కనుక్కోని నీకొడుకూ, నీ దగ్గరకి వస్తున్నాడు నాన్న అని చెప్పగానే అప్పుడే పంపొద్దన్న నీ కొడుకూ నీకు డబ్బు పంపి స్తున్నాడా?? అబద్ధాలు దాగవు. ఏదో రోజు నిజం బైటపడుతుంది. ఏడాది దాకా ఈ అబద్ధం దాగితే అన్నయ్యకి మరోఏడాది అక్కడవుండటానికి పర్మిషన్ వచ్చిందని మరో అబద్ధం ఆడతాను. నిజంతెలిసేదాకా అయినా నీ మనసు తృప్తిగా ఆనందంగా వుంటుంది. అదే మాకూ కావలసింది''. అనుకుంది ప్రమీల తండ్రిలోని ఆనందం, హుషారూ చూసి. ★

# రైతు సామెతల 'చినుకు' విజ్ఞానం

- మాకినీడి సూర్యభాస్కర్

'ఆ గడపేసింది అత్తా అంటే అన్నీ వండవే కోడలా' అందిట, 'పులిచారవేసింది అత్తా అంటే పునికి వండవే కోడలా' అందిట వ్యవసాయ సంబంధీకులైన ఒక యింట్లో అత్తాకోడళ్ళ సంభాషణ యిది. ఇందులో 'ఆగడప... పులిచారలు' అన్నవి చిత్రమైన సామెతలు.

ఆకాశంలో ఎత్తుగా తెల్లని మేఘాలు చదరాలుగా కనబడితే దాన్ని 'ఆగడప' అనీ, చారలుచారలుగా కనబడితే 'పులిచారలు' అనీ అంటారు. 'ఆగడప' మంచి వర్షంకురుస్తుందన్న దానికి సూచనైతే, 'పులిచారలు' సమీప భవిష్యత్తులో వర్షం కురవదని చెబుతాయి.

అందుకే ఈ అత్తగారు 'ఆగడపేసిందని' కోడలు చెబితే అన్నీ వండ మంది త్వరలో వర్షాలు పడతాయి కనుక పరవాలేదు. 'పులిచార' లనగానే పునికి పునికి అంటే పొదుపుగా వండమంది. త్వరలో వర్షాలుండవు కనుక ఉన్న ఆహారపదార్థాలను పొదుపుగా, మితంగా వాడాలని సూచించడం.

వ్యవసాయ దారులైన రైతు యింట్లో అత్తాకోడళ్ళ సంభాషణమే ఇలా ఉంటే, వర్షంతో లంకె పడిన వృత్తిని చేపట్టిన రైతు విషయం వేరే చెప్పాలా? 'వాన రాకడ, ప్రాణం పోకడ తెలీదని కూర్చుంటే కుదురుతుందా? అందుకే రైతు ప్రకృతిని పరిశీలించి, కలిగే మార్పులను గమనించి వర్షాగమనానికి సంబంధించిన కొన్ని ప్రతిపాదనలను సామెతలుగా సృష్టించుకున్నాడు.

సామెత లెప్పుడూ అనుభవజన్యాలే. వ్యవసాయానికి ఆధారభూతమైన జలవనరులను కూర్చే వర్షాల గురించి రైతులు తమ అనుభవసారాన్ని పిండి అందించిన సామెతల ఆమెతల పరిశీలనమే ఈ వ్యాసం.

జూలై నెలలో పంటలకు భూమిని అనువుగా చేసుకోవడమనే ప్రక్రియతో వ్యావసాయిక పనులను ఏప్రిల్ నెలనుండి రైతులు మొదలుపెడతారు. ఏప్రిల్ నుండి సెప్టెంబర్ వరకు ముమ్మరంగా వ్యావసాయిక కార్యకలాపాలు జరిగే కాలాన్ని కార్తెలకు జోడించి తన అనుభవసారాన్ని సామెతలుగా అందించాడు రైతు. వాతావరణ సూచనలు లభించని పూర్వకాలంలో రైతు ఈ సామెతల ఆధారంగానే తన సేద్యపు పనులను నిర్వహించుకునేవాడు. ప్రకృతిలో ఆయా ఋతువుల్లో కలిగే మార్పులను గ్రహిస్తూ, అవి వర్షంమీద చూపే ప్రభావాన్ని అధ్యయనం చేసి రైతు సంపాదించిన విజ్ఞానమే ఈ సామెతలు.

ఒక్కొక్క కార్తె సుమారు పదిహేను రోజులకు కొంచెం అటూయిటూగా ఉంటుంది. ఏప్రిల్‌లో అశ్వని, భరణి కార్తెలు; మేలో కృత్తిక, రోహిణి; జూన్‌లో మృగశిర, ఆరుద్ర; జూలైలో పునర్వసు, పుష్యమి; ఆగష్టులో ఆశ్లేష, మఖ; సెప్టెంబరులో అనురాధ, జ్యేష్ఠ కార్తెలు వస్తాయి. ఆయా కార్తెల్లో వర్షం కురిసే విధానాన్ని బట్టి ఆ సంవత్సరం పంటలు ఆయా విధంగా పండుతాయని రైతుల విశ్వాసం.

భరణి కురిస్తే ధరణి పండుతుందని సామెత. ఏప్రిల్ నెల రెండో సగంలో వస్తుంది భరణికార్తె. వ్యవసాయ పనులు మొదలెట్టే ఈ రోజుల్లో ముందుగా వర్షం పడితే అప్పటివరకు ఎండిన నేల తడిసి సేద్యానికి అనువుగా మారుతుంది. అయితే, ఈ కార్తెలో వర్షంపడడం అసహజమైపోయింది. ప్రస్తుతం ఈ కార్తెలో సామాన్య వృష్టి కురుస్తుంది. కృత్తికలో ఎండలు బాగా కాస్తాయి. తరువాత మేనెల రెండో సగంలో వచ్చే రోహిణికార్తె గురించి 'రోహిణిలో రోళ్లు పగిలే ఎండలు అంటారు. ఈ కార్తెలో ఎండలు ఎంత అధికంగా ఉంటే అంత అధికంగా పంటలు పండుతాయని రైతుల నమ్మకం. అంతేకాకుండా, వడగాల్పులు అధికంగా వీచే కొద్దీ

రానున్న కాలంలో వర్షాలు బాగా పడతాయని రైతుల అధ్యయనం. రోహిణి కార్తెనే 'పెద్దకత్తెర' అని కూడా వ్యవహరిస్తారు. ఈ కార్తెలో ఎండల్ని విశదీకరించే మరోసామెత- "చికిలింత గడ్డి చింత చెట్టుతో వియ్యమందు తానంటే, రోహిణీకార్తెలో ముహూర్తం పెట్టిస్తానన్నది" అనేది గడ్డి చింతచెట్టుతో వియ్యమందడం అంటే అంతెత్తుకు ఎదగడమని అర్థం. అది దురాశ కదా! దాని దురాశను ఎద్దేవా చేస్తూ చెప్పే సామెత యిది. చికిలింత రోహిణిలో నామరూపాల్లేకుండా మాడి చస్తుంది.

జూన్ నెలలో మృగశిర, ఆరుద్ర కార్తెలు, 'మృగశిర చిందిస్తే ముసలెద్దు రంకె వేస్తుందట'. చిందించడమంటే కార్తె ప్రారంభంలో వర్షం పడడం. మృగశిర కార్తె ప్రవేశించడంతోనే వర్షాలు పడితే పచ్చిక బాగా మొలచి పశువులకు... గ్రాసం బాగా లభ్యమవుతుంది. అందువల్లనే మూలనున్న ముసలి ఎద్దు కూడా రంకె వేస్తుందని చెప్పడం. పశుశక్తి బాగా ఉండడంవల్ల ఈ కార్తెలో వ్యవసాయ పనులుచురుగ్గా సాగుతాయి. అలాగే, 'ఆరుద్ర చిందిస్తే అరవై దినాల వరుపు' ఆరుద్రకార్తె ప్రారంభంలో వర్షం కురిసి ఆగిపోతే తరువాత వచ్చే అరవైరోజులపాటు (రెండు నెలలు-సుమారుగా జూన్ 15 నుంచి ఆగష్టు 15 వరకు) 'వర్షం వరుపు' అంటే ఉండదని అర్థం. ఈ కార్తె అంతా వర్షాలు పడితే మంచిది. నైరుతీ పవనాలు ఈ కార్తెలోనే వస్తాయి అనువైన కాలంగా ఈ కార్తెను రైతులు భావిస్తారు. నిరంతరం వర్షాలతో ఉండే ఈ కార్తెను 'ఆరుద్ర' అని కూడ అంటారు. మృగశిరలో సామాన్య వృష్టి అయినా ఆరుద్రలో సువృష్టి కురుస్తుంది.

జూలైలో వచ్చే పునర్వసు, పుష్యమి కార్తెల్లోని వర్షాలకు 'పూరిపిట్టతోక తడవదని' సామెత. ఈ కార్తెలో చిరుజల్లులే తప్ప పెద్దవర్షాలుండవు అందువల్ల ఈ సామెత వచ్చింది. పూరిపిట్ట అనేది బూడిదరంగులో ఉండే పక్షి. రైతు బాంధవి. పంటల నాశించే కీటకాలను తిని, పంటలు బాగా పెరగడానికి దోహదం చేస్తుంది. ఆగష్టు రెండో సగంలో వచ్చే కార్తె 'మఖ'. 'మఖలో ఉరిమితే మదురు మీద కర్ర పండుతుందని' నానుడి. మఖ ఉరవడమంటే బాగా వర్షాలు కురవడం. మట్టి గోడలు వర్షంతో తడిసి నానిపోయి పాడైపోకుండా వాటిపైన కట్టే కప్పును 'మదురు' అంటారు. పిట్టల రెట్టలద్వారా మదురుపైన పడిన విత్తనాలు మఖ ఉరిమినప్పుడు మొలకలేస్తాయని, అలాంటి పరిస్థితిలో మంచి పంటలు పండుతాయనే రైతుల విశ్వాసం. అయితే శాస్త్రీయ విజ్ఞానం చెప్పేదేమంటే ఈ కార్తెలో సామాన్య వృష్టి మాత్రమే కురుస్తుంది.

సెప్టెంబరు నెలలో వచ్చే కార్తెలు పుబ్బ, ఉత్తర 'మఖలో పుట్టి పుబ్బలో మాడిపోవడం'. అనేది ప్రసిద్ధి చెందిన సామెత. అంటే పుబ్బలో వర్షాలు ఉండవని అభిప్రాయం కావచ్చు అయితే, 'పుబ్బరేగినా, బూజు రేగినా వదలదనే సామెత' కూడా ఉంది. పుబ్బ కార్తెలో మొదలైతే ఆ కార్తె అంతా ఉంటుందన్న పరిశీలనను ఈ సామెత తెలియజేస్తుంది. ఆ తర్వాత వచ్చే కార్తె ఉత్తర. 'ఉత్తర ఉరిమినా, తాచు తరిమినా

వదలదని' నానుడి. ఉత్తరలో ప్రారంభమైన వర్షం కొన్ని రోజులపాటు ముసురు వేస్తుంది. ఈ కార్తె ఈశాన్య రుతుపవనాలు ప్రారంభమయ్యే కాలం. సేద్యానికి కావలసిన మంచి వర్షాలు ఈ కార్తెలో కురుస్తాయి. అందుకే 'ఉత్తర చూసి ఎత్తర గంప... విశాఖచూసి విడవర కొంప' అనే ప్రసిద్ధ సామెత పుట్టుకొచ్చింది. ఉత్తర వరకు వర్షాలు లేకపోతే భావం నవంబరు రెండవ సగంలో వచ్చేది విశాఖ కార్తె. ఈ కార్తెలో అంతగా వర్షాలుండవు. ఒకవేళ పడ్డాయా, పంటలను పురుగు ఆశిస్తుంది. పండిన పంటంతా నాశనమవుతుంది. అందువల్ల రైతుయింట్లో ఆహారం మృగ్యమౌతుంది. అప్పుడు ఆహారంకోసం దేశాంతరం వలసపోవడం తప్ప గత్యంతరం ఉండేదికాదు. వెనుకటి రోజుల్లో పరిస్థితి యిది. అందుకే, విశాఖచూసి విడువర కొంప' అనడం.

అక్టోబరు నెల హస్త, చిత్త కార్తెలు హస్తలో వర్షాలుండవు. రెండో సగంలో వచ్చే చిత్తకార్తె చిరుజల్లులకు ప్రసిద్ధి. 'చిత్త చిందిస్తే చిత్తం చిందులేస్తుందట' దుక్కి దున్ని విత్తనం చల్లాకా వర్షం పడితే ఆనందంకాక మరేమిటి?

నవంబరు నెలలో వచ్చేవి స్వాతి, విశాఖ కార్తెలు. 'స్వాతి మెరిస్తే మంచిదని' అంటారు. ఈ కార్తెలో సముద్రం మీద కనిపించే మెరుపు వర్షాగమనాన్ని సూచిస్తుంది. స్వాతి కార్తె వరకు వర్షాలు లేకపోతే నాలుగు వైపులకూ నాలుగు బృందాల బయలుదేరి గువ్వల కువకువలు వినబడుతాయేమోననే ఆశతో సుమారు ఇరవై మైళ్ళు ప్రయాణించే వారు పాపం రైతులు. ఆ లోపు గువ్వల కువకువలు వినబడితే త్వరలో వర్షాలు పడతాయని నమ్మకం. ఆ బృందం వచ్చి ఊరిలో చెప్పేది. గువ్వల కువకువలు లేకపోతే ఇక అంతే. విశాఖ చూసి ఆహారం లభ్యమయ్యే ప్రాంతాలను వెతుక్కుంటూ కొంప విడవడమే.

డిసెంబరు మొదటిసగంలో వచ్చే అనూరాధకార్తె 'అనారోగిలో తడిస్తే మనోరోగాలు పోతాయి' అని సామెత. అనూరాధను రైతులు అనారోగి అంటారు. ఈ కార్తెలో వర్షాలు యించుమించుగా ఆగిపోయి చలి ప్రారంభ మౌతుంది. విశాఖలో వర్షం కురవడంవల్ల పంటల నాశించిన చీడపీడలు అనూరాధలో పడిన వర్షంవల్ల నశిస్తాయి. అందువల్ల అంతవరకు రైతును పీడించిన మనోరోగం పోతుంది.

వర్షాగమనాన్ని సూచించే శాస్త్రీయ పద్ధతులు అందుబాటులో లేని పూర్వకాలంలో రైతులు ఈ విధంగా క్షణక్షణం వర్షం కోసం ఎదురుచూస్తూ తమ పరిశీలనలోకి వచ్చిన అనుభవసారాన్ని తరువాతి తరాలవారికి సామెతల రూపంలో అందించారు. అప్పుడు, ఇప్పుడు ఎప్పుడూ, వ్యవసాయం, 'వెర్రివాని చేతిలో రాయి' అనక తప్పదు. ఆరోజుల్లో వర్షాలు ఎప్పుడు పడుతాయో అంచనా వేసుకోవడమే రైతుకు గగనమైతే, వర్షాలు, తుఫానుల ఆగమనాన్ని ముందుగానే ఊహించగలుగుతునఈ రోజుల్లో కూడా అతివృష్టి, అనావృష్టుల వల్ల రైతు నష్టపోతూనే ఉన్నాడు. అప్పులు తీర్చలేని స్థితిలోఆత్మహత్యల పాలవుతూనే ఉన్నాడు.

వర్షం సూచనలే కాకుండా అవి కావాలను కున్నపుడు పడేలాగా, అవసరం లేదనుకున్నపుడు ఆగేలాగా మనిషి చెప్పుచేతల్లోకి వచ్చేవరకు ఈ పరిస్థితి తప్పదేమో! ★

# పొత్తిళ్ళలోంచి

**- కె.బి. కృష్ణ**

దేశరాజధాని ఢిల్లీతో సహా ఆంధ్రప్రదేశ్‌లో అనేక ప్రాంతాలలో వచన కవితా ధారణ చేసిన కవి. కవులందరికీ సుపరిచితుడే. ఎందుకంటే కవికి తను వ్రాసిన కవిత (సుమారు 150లైన్లు) తనే గుర్తు పెట్టుకోలేని స్థితిలో వుంటే, శ్రీ స్వామి తడుముకోకుండా ఆ కవితను ధారణ చేయడం, డా॥ అద్దేపల్లి వంటి పలువురు సాహితీ వేత్తల ప్రశంసలు పొందడం అనన్య సామాన్యం. అలాంటి వచన కవితా ధారణ చక్రవర్తి (తూర్పు గోదావరి జిల్లాలో వేము సరదాగా 'వచన కవితా ధారణ రక్షకుడు' అంటూ వుంటాం).



**పొత్తిళ్ళలోంచి**
**(కవిత్వం)**
**రచయిత**
**పి.ఆర్.యల్. స్వామి**
వెల : రూ. **70/-** లు.
ప్రతులకు :
పి.వి.రావు,
ఇ.యస్.యల్. ప్రాజెక్ట్,
పలమనేరు, చిత్తూరుజిల్లా.
ఫోన్: 08579-253430

అలాంటి స్వామి ఇప్పుడు "పొత్తిళ్ళలోంచి" అనే కవితా సంపుటితో కవిగా అవతరించాడు. ఆప్యాయత, కరుణ, ప్రేమ తొంగి చూసే అమ్మవొడిలో వొదిగి పోయిన పసిపాప ముఖచిత్రమే ఈ పుస్తకంలోని కవితలు ఎలా ఉంటాయో చెప్పకనే చెబుతుంది. పొత్తిళ్ళలోంచి కవితలో,

"అమ్మ నా నోటి కందించిన
అమృత బిందువుల్లాంటి !
చనుచాల చుక్కలే ఇప్పటి
నా నాలుక మీద
ఈ కవిత్వ భీజాక్షరాలు..."

ఈ ఒక్క కవితలోనే కవిలో ఎంత నిజాయితీ, నిబద్ధత ఉందో తెలుస్తుంది. తల్లి తండ్రులంటే ఈ స్వామికి అపరిమితమైన స్వామి భక్తి. కేబుల్ టి.వి.ని 'కేబుల్ బలిపీఠం' అనే శీర్షిక క్రింద తూర్పార పడతాడు కవి.

"బలిపీఠం సాక్షిగా మేమంతా కలిసే వున్నా ఎవరికి వాళ్ళం ఎపిసోడ్స్‌గా/విడి విడిగా బ్రతుకుతున్నాం. ఎంత దయనీయ దృశ్యం ఇది ?."

ఇలాగ ఈ కవితా సంపుటిలో అమ్మతో మొదలు పెట్టి, బాలకార్మికులు, రైతులు, పంట కాలువలు, శ్రామి కులు, ఎవర్ని వదల లేదు కవి. ఇవి కవితా చిత్రాలవలె వున్నాయి. తొలి కవితా సంపుటితోనే, ఆరితేరిన కవిగా కనుపించే స్వామి అభినంద నీయుడు.

ఇటీవల పాండిచ్చేరి ప్రభుత్వం 2004 సంవత్సరానికి గాను, 'కలైమామణి' (కళ్ళలోమణి వంటివాడు) అవార్డ్ స్వామికి ప్రకటించడం, స్వామి కవితా జీవితానికి ఒక కలికితురాయి అని చెప్పాలి.

సంపుటి కావాల్సిన వారు రచయిత 8-403 జక్రియనగర్, యానం ను సంప్రదించవచ్చును వెల రూ॥ 70/-. ★

## 'అణువు' పాఠకులకు విజ్ఞప్తి

'అణువు' శీర్షికలో పైనా కిందా ఏక పంక్తిగా ప్రచురిస్తున్న మినీకవితలకు రచయిత పేరును తెలియజేస్తే బావుంటుందని చాలా మంది రాస్తున్నారు.

'అణువు' శీర్షికలో రచయిత పేరు లేని ప్రతిఅక్షరమూ నిర్వాహకుడిదేనని వారందరికీ తెలియ జేస్తున్నాం. - సంపాదకుడు.

# రాఘవులు

**- దార్ల తిరుపతిరావు**



“రాఘవులు ఇండియా వస్తున్నాడు. అమ్మమ్మా” అరిచాను చేతిలోని ఉత్తరం టేబిల్ మీద పెడ్తూ. 80 ఏళ్లు పైబడిన ఆ ముసలావిడ ఆశ్చర్యంగా చూస్తుండగా లోపలికెళ్లాను.



ఎన్నిరోజులైందో, ఉహూ... ఎన్ని సంవత్సరాలైందో అతన్నిచూసి. దూరం అప్యాయతల్ని పెంచుతుంది గదా? నా ఆత్మలో ఆత్మ అతను. నలభై సంవత్సరాలపైమాటే. అందంగా అతను రాసే ఉత్తరాల్లో తప్ప అతనిగురించి, అతని కుటుంబం గురించీ ప్రత్యక్షంగా తెలీదు. అతను ఉత్తరం రాస్తే 'పిక్చర్' వేస్తాడు. ఇన్నాళ్టికి అతను భార్యా, ఇద్దరు పిల్లల్తో ఈ ఊరొస్తున్నాడు.

గతకాలము మేలు-వచ్చు కాలముకంటే అన్నట్టుంటాయి మా ఇద్దరి ముచ్చట్ల జ్ఞాపకాలు.



మా మల్లయ్యపేటలో అప్పటికింకా ఊరికి నాలుగు వైపులా నాలుగు చెరువులున్న రోజులు. ఒకటి మాత్రమే హైస్కూలు, నాలుగు ప్రయిమరీ స్కూళ్లున్న రోజులు. వర్షంకురిస్తే రోడ్లనించి మట్టి వాసన గుభాళించే రోజులు. పెరట్లో-మామిడి చెట్లూ, అరటి చెట్లూ ప్రక్క ప్రక్కనే -వర్ణవివక్ష లేకుండా పెరిగే రోజులు, జూన్ రెండో వారంలోనే తొలకరి - చిలకరించే రోజులు. ఉన్న ఒకే సినిమా హాల్లో 'జానపదాలే' వినిపించి, పలకరించే రోజులు. అది మమ్మీ, డాడీ సంస్కృతి యింకా మొదలవని రోజులు. రేషన్‌షాపులో పంచదార తప్ప ఇంకేమీ ఇవ్వని రోజులు.

ఆరోజు సన్నగా తుంపరపడుతుంటే హైస్కూల్లో జాయిన్‌కావడానికి నేనూ, నన్ను జాయిన్ చెయ్యడానికి మా పెద్దమ్మగారబ్బాయి హైస్కూల్లో ప్రవేశించాము. అప్పుడే రివటలాంటి ఓ ముసలాయన నాలాగే ఉన్న ఓ కుర్రాణ్ణి వెంటబెట్టుకొని మా ప్రక్కనే నడుస్తూ.

“బాబూ! మావోణ్ని ఇస్కూల్లో జేర్పించాల కుంచెం సాయింజేత్తావా, నాకు ఇక్కడ సంగతులేవీ తెలీవు''. అని మా అన్నయ్యతో అంటూ ఒదిగిపోతున్నట్టు ప్రక్కకి జరిగాడు.

మా అన్నయ్య ఎందుకో అదోలాచూసి 'రా' అన్నాడు. ఎందుకో మా అన్నయ్య చూపులో,

పిలుపులో తేలికభావం కనిపించింది. నాకూ, రాఘవులు అనే ఆ అబ్బాయికి జాయిన్ కావడానికి-వయసు సరిపోక-ఒక సంవత్సరం పుట్టుక తేదీ-పెంచి హైస్కూల్లో జాయిన్‌చేసాడు. ఎప్పుడు, ఎందుకు అలాచేసాడో మా అన్నయ్య ఆరోజునుండి ఇప్పటి వరకూ మా స్నేహం స్నేహానికే గర్వకారణమైంది.

రాఘవులు వాళ్ల నాన్న - ఉంటే పొలం పన్లు చేసేవాడు లేదంటే పట్నంలో పప్పుల బజార్లో మూటలు మోసేవాడు. ఎప్పుడూ వంట్లో ఆరోగ్యం బావుండేది కాదు. దగ్గుతూ ఉండేవాడు. వాళ్లు ఊరిశివార్లలో ఉండే గుడిశెల్లో ఉండేవారు.

రాఘవులు ప్రతిసంవత్సరం స్కూల్ ఫస్టే ఒక ప్రక్క ఆటలు బాగా ఆడేవాడు, ఇంట్లో పనులన్నీ అతనే చేసేవాడు. నీళ్లకావిడి మోసేదగ్గర్నుంచి బజారు నుంచి కూరలు తేవడం వరకూ అతనే వాళ్లింట్లో మాది మధ్య తరగతికి దిగువ - బడుగు వర్గానికి ఎగువ. నాకు ఆ అవసరాలు లేవు. స్కూలు నించి వచ్చిన వెంటనే వాళ్ల గుడిశెలవైపు వెళ్లిపోయేవాణ్ని రాఘవుల్తో తిరగడంవల్ల మా వీధిలో ఉండే నా ఈడు కుర్రాళ్లు నాతో సరిగ్గా ఉండేవాళ్లుకాదు. రాఘవులు మాత్రం వాళ్లతో కూడా కలిసిపోయేవాడు. గూడెంనించి హైస్కూల్లో చదివేవారు తక్కువ; అందులోనూ అతను బాగా చదివే వాడవడం వల్ల - అందరూ గౌరవంగా చూసేవారు.

అతన్తో చేపల మార్కెట్‌కి వెళ్లి - అతని చేపల సంచి మోసే వాణ్ని. అందరూ వింతగా చూసేవారు నా కేసి. బజారు నించి ఏమైనా సరుకులు తేవలసివస్తే ఇద్దరం మోసుకొచ్చేవాళ్లం. శెలవు రోజొస్తే చాలు - ఇద్దరూ కల్సి దుంపతోటలో దుంపలు తవ్వి 'తంపట' పెట్టి కాల్చుకొనితినే వాళ్లం. వేరుశెనగ చేలోపడి. పాలతో ఉన్న పనలు కోసి వేరు శెనగ కాయలు తినేవాళ్లం. కొక్కెం గాలం కొని వర్షం నీళ్లున్న గుంటల్లో 'మట్టగిడసలు' పట్టేవాళ్లం. వాళ్లమ్మ కాల్చి పెడితేనే తినేవాళ్లం. పుల్లమామిడి కాయలు, జాంకాయలు దొంగతనంగా కోసి - ఉప్పు, కారం, అద్దుకొని తినేవాళ్లం,

గుబురుగా పెరిగిన దొడ్లో, ఎండు కసివింత పుల్లలకి రంధ్రం చేసి రాఘవులు తెచ్చిన అగ్గిపుల్ల నేల మీదగీసి వెలిగించి సిగరెట్‌లా కాల్చేవాళ్లం. మిణుగురు పురుగుల్ని రాత్రిళ్లు పట్టుకొని పుస్తకంలో దాచి ప్రొద్దున్న మా మిగిలిన ఫ్రెండ్స్‌కి చూపించ డానికి తీసుకెళ్లేవాళ్లం-పుస్తకం తెరిచి చూస్తే చచ్చిపోయివుండేవి. ఆరుద్ర పురుగులు పట్టుకొని 'ముఖ్‌మల్' లా వుండేదాన్ని తాకి ఆనంద పడిపోయేవాళ్లం.

ఇన్ని చేసినా అతని 'ప్రోగ్రెస్ రిపోర్టు'లో ఒక ఎర్రగీత కూడా ఉండేదికాదు. నాకు మాత్రం - ఒకటో, రెండో ఉండేవి. ఈ సారైనా 'మంత్లీ టెస్టు'లో రాఘవులులా ఎర్రగీతలేకుండా చూసుకోవాలనుకొనే వాణ్ని . నా గీత మారేది కాదు.

అతనికి ప్రతీ సంవత్సరం సోషల్ వెల్ఫేర్ స్కాలర్‌షిప్ మెరిట్ స్కాలర్‌షిప్పు వచ్చేవి. మెరిట్ స్కాలర్‌షిప్, ఎక్కువ డబ్బుల నీ - అదే తీసుకొనేవాడు.

అతను మా ఇంటికి రావడం మొదట్లో అమ్మమ్మకి ఇష్టముండేదికాదు. చుట్టుప్రక్కల జనం ఏమన్నా అనుకొంటా రేమోనని అమ్మమ్మ భయం. మా అమ్మమ్మకి ముక్కుపొడుం, నల్లమందు వాడ్డం అలవాటుండేది. వాటితో గాని దానికి నిద్రపట్టేదికాదు. అప్పట్లో నల్లమందు దొంగ తనంగా అమ్మేవారు. అది మాన్పించడం ఇంట్లో వాళ్లతరం గాలేదు. రాఘవులు చాలా తెలివైనవాడు నల్లమందు

**గిన్నిస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్**

సర్ హ్యూగ్ బీవర్ (ఇంగ్లండ్) అనే వ్యక్తికి పక్షులను వేటాడే అలవాటుండేది. 'గిన్నిస్ బ్రూవరీ' అనే బీరును తయారు చేసే సంస్థకు డైరెక్టర్‌గా ఉండేవాడు. యూరప్‌లో కెల్లా వేగంగా ఎగిరే పక్షి ఏది? అనే సందేహాన్ని తీర్చుకోవడానికి తగిన పుస్తకమేదీ ఆయనకు కనిపించలేదు. బీవర్ కోరిక మేరకు నారిస్ మెక్‌విర్టర్, రాస్‌మెక్ విర్టర్‌లు ఇలాంటివింతలు విశేషాలను సేకరించి గ్రంథాన్ని రూపొందించారు. ఆ గ్రంథమే 'గిన్నీస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' అనే పేరు ప్రచురింపబడింది. ఈ ప్రచురణ 27-8-1955న జరిగింది.

వేనుకోవడం తను మాన్పిస్తానన్నాడు. పందెం కాశాను అతను మాన్పించ గలిగితే అతన్ని అద్దె సైకిల్ మీద కాకినాడ తీసుకెళ్లి కొత్త సినిమా చూపించాలి.

ఆరోజు బియ్యంలో ఓ మాదిరి నల్లరాళ్లు ఏరి వాటికి కొబ్బరి నూనె రాసి నల్ల మందులా ఆకులో చుట్టి ఇచ్చాడు మా అమ్మమ్మకి రోజూ ఒక మట్టి రాయి నల్ల మందనుకొని మింగేది. మామూలుగానే పదిరోజుల్లైంతర్వాత మళ్లీ 'నల్లమందు' కావాలంది. అప్పుడు అమ్మమ్మకి అసలు సంగతి చెప్పాడు. నల్లమందువల్ల నిద్రపట్టడం జరగదు. అని చెప్పాడు. నల్లమందువల్ల ఉపయోగంలేదని తెలిసింతర్వాత అమ్మమ్మ మానేసింది. ఆ తర్వాత అమ్మమ్మక్కూడా అతను మంచివాడైపోయాడు.

ఆరోజు – నాకు ఇప్పటికీ బాగా జ్ఞాపకం– ఆ తర్వాత నన్ను ఎప్పుడూ వదిలిపెట్టలేదు అతను. ఆ సంఘటన వేసవి శెలవుల్లో జరిగింది. తొమ్మిదో తరగతి పరీక్షలు రాశాము.

రాఘవులు వాళ్ల నాన్నకి ఆరోగ్యం పూర్తిగా పాడైంది. దాంతో వాళ్లమ్మ పాచిపనులు చేయడానికి ఎక్కడెక్కడో తిరిగి ఇంత తెచ్చేది అప్పుడప్పుడు మా ఇంట్లోనే తినే వాడు రాఘవులు. "బాబూ, సత్యవతమ్మ గారింట్లో వేరుశెనక్కాయలు కొట్టడానికి వెళ్లకూడదూ.. శేరుకి పావలాయో అర్ధో ఇస్తారు" అంది మా అమ్మమ్మ రాఘవుల్తో.

"వెళ్తానమ్మమ్మా, పుస్తకాలు కొనుక్కోడానికైనా పనికొస్తాయి" అన్నాడు. చదువంటే అభిమానం అతనికి నేనూ వెళ్తానన్నాను ఎందుకంటే రాఘవుల్ని ఇంకా కాకినాడ సినిమాకి తీసుకెళ్లలేదు చాలా రోజులైపోయింది అతను పందెం గెలిచి మరి.

ఊళ్లోని మోతుబరి రైతుభార్య సత్యవతమ్మ ఇంటి దగ్గర పాత వేరుశెనక్కాయలు కొట్టించి, వేరు శెనగ గుళ్లు ఎండపెట్టి విత్తనాలుగా వాడేవారు. వేరు శెనగగుళ్లు శేరు వలిచి నందుకు పావలా ఇచ్చేది. పొల్లుకాయల్లో వచ్చే చచ్చూ పుచ్చూ వలిచిన వాళ్లకి ఇచ్చేది. అదీ దయాధర్మభిక్ష. రోజుకి ఇంచుమించు పది, పన్నెండు శేర్లు వలిచేవారు కొంత మంది పిల్లాజెల్లాతో వచ్చేవారు. అదే ఆదరువు అయ్యేది కొంతమంది చచ్చువి ఇళ్లకి తీసుకుపోయేవారు. అంతమాత్రానికే వాళ్లు ఆమెని 'మారాజుతల్లి' అనేవారు అభిమానంగా అందులో ఎక్కువ మంది మరి రాఘవులున్నగుడిశెల వాళ్లే.

ఆరోజు నేనూ, రాఘవులు అమ్మమ్మతో వెళ్లాం అక్కడికి. రాఘవులు ఏ పన్లోకి వెళ్లినా వెంటనే చొచ్చుకు పోతాడు. వేరుశెనక్కాయలు కొట్టడం మొదలెట్టాడు. ప్రక్కనే కూర్చొన్న నేను మాత్రం మామూలే.

మండువాలోగిలి వల్ల ఎండచుర్రుమంటుంది. అయినా స్పీడుగానే కొడుతున్నాడు రాఘవులు. నాకు ఆకలేస్తోంది. అతనికీ ఆకలేస్తుందేమో కొట్టిన గుళ్లల్లోంచి గుప్పెడు నోట్లో వేసుకొన్నాము. అవి ఆగుతాయా? ఎవరూ చూడ్డంలేదనుకొని రెండో సారి మళ్లీ గుప్పెటితో నోట్లో వేసుకొన్నాను నేను. అతను కూడా నన్ను చూసి గుప్పెటనిండా తీసినోట్లో వేసుకున్నాడు. అప్పుడు పడింది మూతి మీద పిడిగుద్దు. పళ్లు రాలాయో లేదో గానీ రక్తం కలిసిన వేరుశెనగ గుళ్లు అతని నోట్లోంచిరాలి పడ్డాయి.

" అలగా నాకొడకా వేరుశెనక్కాయలు వొలవరా అంటే తిని పెడతావురా నాకొడకా! నీకు డబ్బులిచ్చే దెందుకురా. ఎల్లేటప్పుడు ఎలాగూ పెడుతున్నా గదరా. అప్పుడూ పట్టుకెళ్లి ఇప్పుడూ తినేస్తే మేమేంచెయ్యాల్రా ఎదవా? ఫో! మళ్లీరావద్దుపో!"

**గిడుగు రామమూర్తి పంతులు**

శ్రీకాకుళం జిల్లా పర్వతాలపేటలో ఆగష్టు 29, 1863న జన్మించినారు. మహారాజా కళాశాలలో గురజాడ వారు వీరికి సహాధ్యాయి. సవరజాతి వారి కోసం పాఠశాలలు పెట్టించాలని ప్రయత్నించారు. సరవ భాషకు ఒక లిపిని ఏర్పాటు చేసి సరవ భాషా రచనలు సేకరించారు. సరవ భాషా నిఘంటువు, సరవ భాషా వ్యాకరణ నిర్మాణంలో వీరి కృషి ఎన్నదగినది. వాడుక భాషా ఉద్యమాన్ని నడిపి 'గిడుగు పిడుగు' అని పించుకున్నారు. పాఠ్య పుస్తకాలలో వాడుక భాషను ప్రవేశ పెట్టడంలోను, సాహిత్య రంగంలో వ్యావహారికభాష విస్తృతంగా వ్యాప్తి చెందడంలోను వీరు విశేష కృషి చేశారు.

అంటూ మెడపట్టుకొని విసురుగా గెంటేసింది సత్యవతమ్మ. మేము చూళ్లేదుగానీ మా వెనక్కాలే పనిమనిషి చేత పేలు తీయించుకొంటుంది సత్యవతమ్మ .

రాఘవులు దీనంగా చూసి కారుతున్న రక్తాన్ని చొక్కాకి తుడుచుకొంటూ నిలబడి నాకేసి చూసాడు. నాకు వంట్లో రక్తం మరిగిపోయింది. నేనూ నుంచున్నాను.

"ఏం భద్రయ్యమ్మ మనవడా నువ్వుకూర్చో ఇలాంటి ఎదవల్తో నీకేంటి. ఈడితో చెట్టపట్టా లేంట్రా నీకు. నువ్వెళ్లేటప్పుడు నీకు వేరుశెనగగుళ్లు ఇస్తాను. పట్టుకెళ్లి మీ అమ్మమ్మకియ్యి పప్పుండలు చేసిపెడద్ది. కూర్చో!" అంది.

ఇంకా ఏదేదో మాట్లాడుతుంది గానీ నాకు ఆమె మాటలు వినపడ్డంలేదు! చెట్టాపట్లాలేంట్రా అంటుందా? కులాన్ని చూసుకొని చెట్టాపట్టా లేనుకోవాలా? "అదీ రాఘవుల్తో స్నేహం చెయ్యొద్దంటుందా" అన్పించగానే పిడికిలి బిగిసింది.

రాఘవులు చెయ్యి పట్టుకున్నాను గట్టిగా. అటూ ఇటూ చూసాను. "రా" అని రాఘవుల్ని లాగి, అప్పటివరకూ మేమిద్దరం వలచిన 'వేరుశెనగ గింజల్ని' కాల్తో తన్ని చెల్లా చెదురు చేసి పరిగెత్తాం. అక్కడున్నవాళ్లందరూ తెల్లబోయి చూస్తున్నారు మావంక. పెద్దపాలేరు పరిగెత్తుకు రావడం కూడా కన్పించింది. మేము స్కూల్ రన్నింగ్ రేస్‌లో ఫస్టు, సెకండ్ మరి - వాళ్లకి దొరకలేదు. ఆ తర్వాత మా ఇద్దరి స్నేహానికీ ఏ కులం అడ్డుగోడగా నిలవలేక పోయింది. కాలం కూడా పరీక్షపెట్టి ఓడిపోయింది.

★ ★ ★

రాఘవులు కుటుంబంతో ఓ నెల రోజులపాటు మాకు హాయిగా గడిచిపోయింది.

అప్పట్లో రాఘవులూ, నేనూ అమ్మమ్మ - సత్యవతమ్మ యిచ్చిన పుచ్చు వేరుశెనగ పప్పుతో బెల్లం కలిపి చేసిన ఉండలు ఇష్టంగా తినేవాళ్లం. కానీ సత్యవతమ్మ మా వాణ్ని కొట్టిన తర్వాత వేరు శెనగ ఉండలంటే నాకు అసహ్యం వేసింది.

ఆ రోజు వేరుశెనగ వుండలు మా ఆవిడ టేబిల్ మీద పెట్టింది రాఘవులు భార్యా, పిల్లలు తిండం మొదలు పెట్టారు. రాఘవులు మాత్రం నాకేసి చూడ్డం మొదలెట్టాడు నవ్వుతూ.

"నాకు మంచి ఫ్రెండ్ నిచ్చిన 'వేరుశెనగ' గుళ్లు అంటే చాలా యిష్టం" అంటూ ఒకటి చేతిలోకి తీసుకున్నాడు. "నాఫ్రండ్ రక్తం కళ్లచూసిన 'వేరుశెనగ' పప్పు అంటే నాకసహ్యం" - అంటూ ప్లేట్‌ని వెనక్కితోసాను నేను. నవ్వుతూ ఆరోజు పేపర్ చేతిలోకి తీసుకున్నాడతను.

"అంటరానికులం పిల్లల సహపంక్తిన అగ్రకులాల వారి పిల్లలకి భోజనం"- కారణంగా అగ్రకులాలవారి పిల్లలు బడికి వెళ్లని కారణంగా ఓ చోట 'మధ్యాహ్నభోజన' పథకం విఫలం.

"అంటరాని వారు తయారు చేసిన వంటలు మిగిలిన పిల్లలు తినని కారణంగా మిగిలిపోయిన అన్నం. మిగిలిన పదార్థాలు - కాకులు, కుక్కలు తింటూ" కలర్‌ఫోటో

ఆ వార్త మా ఇద్దరి చూపుల్ని తప్పించుకోలేక పోయింది. ఫోటో తళుక్కున మెరిసింది.

మా ఇద్దరి చూపులు ఒకేసారి కలునుకున్నాయి. 'మనిద్దరిలాగే ఆ పిల్లల తల్లిదండ్రులుంటే ఇలాజరిగి ఉండేదా? అన్నట్టుందా చూపు. 'ఛీ!' అంటూ పేపర్ విసిరేసాన్నేను వాడి చేతుల్లోంచి "మొదట్నించీ ఇంతే నమ్మాయితను" అంటూ మా ఆవిడకేసి తిరిగి నవ్వుతున్నాడు అతను. ★

**ఉస్మానియా విశ్వవిద్యాలయం**

నిజాం సంస్థానంలో ఆనాడు ఉర్దూ చదవడం, వ్రాయడం తెలిసిన వారు తక్కువగా ఉండడం వల్ల స్థానికులకు ఉర్దూ విద్యనందించాలన్న ఉద్దేశ్యంతో ఏడవ నిజాం మీర్ ఉస్మానలీఖాన్ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలనుకున్నారు. వీరి పేరుమీదనే ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆగష్టు 28, 1919వ సం॥లో ఏర్పాటైంది. దీనిని ప్రముఖంగా పర్యవేక్షించిన సర్ అక్బర్ హైదరీని ఉస్మానియా విశ్వవిద్యాలయ పితామహునిగా పేర్కొంటారు.

# అభ్యుదయ కవిత్వం యువకవుల కర్తవ్యాలు

**- విరియాల లక్ష్మీపతి**

నేటి సంకీర్ణ సమాజంలో మానవతా విలువలన్నీ తలక్రిందవుతున్నాయి. సామాన్య మానవుని ఉనికి దుర్భరమైంది. ప్రపంచీకరణ వత్తిడిలో భారతీయ సంస్కృతి వెర్రితలలు వేస్తోంది. ఈ నేపథ్యంలో కొంతమంది మేధావులు విమర్శకులు తమ కర్తవ్యాల్ని విస్మరిస్తూ పోస్టుమోడర్నిజం అధునాతన వాదం, పూర్వవాదం, ఉత్తరవాదం అంటూ ఎవరికీ అర్థంకాని నిర్వచనాలు ప్రవచిస్తూ యువకవుల్ని, వచన కవిత్వాన్ని, తప్పుదారిలో మళ్లించడానికి ప్రయత్నిస్తున్నారు. అభ్యుదయ కవిత్వం చేయవలసిన పవిత్రకార్యం ఏదైతే ఉందో అది నిర్వహించడం పూర్తి అయిందని ఇకదాని అవసరమే లేదని గంటలు వాయిస్తున్నారు. ఇది ప్రజాకవిత్వం పట్ల వారు చేస్తున్న ద్రోహమే కాని వేరేదీకాదు, అని చెప్పకతప్పదు.

మానవాళికి ఆక్సిజన్ ఎంత అవసరమో జాతి అభ్యున్నతికి ప్రతి దశలోనూ అభ్యుదయ కవిత్వమూ అంతే అవసరం అన్నది త్రికాల సత్యం. అభ్యుదయం అనే పదానికీ, సమాజ పరిణామాలకీ విడదీయరాని సంబంధం నెలకొని వుంది. గతిశీలంగా నడిచే సామాజిక పరిణామాలకీ ఉత్పన్నమైన సమస్యలకీ పరిష్కార నేపథ్య దిశగానే అభ్యుదయ సాహిత్యం సృజించబడుతుంది. అదే సృజన నేటికీ కొనసాగుతోంది.

స్వాతంత్ర్యోద్యమకాలంలో శ్వేత జాతీయులను ఎదిరిస్తూ వచ్చిన కవిత్వమూ, నిజాంప్రభుత్వంలో జరిగిన దమనకాండను నిరసిస్తూ వచ్చిన కవిత్వమూ, మతతత్వంలో గల మూఢత్వాన్ని విమర్శిస్తూ వచ్చిన కవిత్వమూ, దళితస్త్రీ మైనారిటీలపై జరిగే అత్యాచారాల్ని ఖండిస్తూ వచ్చిన కవిత్వమూ, బూర్జువా వ్యవస్థలలో గల లోపాల్ని ఎండగట్టి సోషలిస్టువ్యవస్థకు ఆహ్వానం పలికే కవిత్వమూ, ఇలా అన్ని దశల్లోనూ అభ్యుదయ సాహిత్యం ఆటగా, కథగా, గేయంగా, కవితగా, బుర్రకథగా ఆవిర్భవించి దాని పవిత్ర కార్యం అది నేరవేరుస్తూ వచ్చింది. అయితే ఈ సాహిత్యం సృజించి ప్రచారం చేయడానికి కమ్యూనిస్టులే కానక్కర్లేదు. ముఖ్యంగా నేటి యువకవులు కమ్యూనిస్టులు కానివారు కూడా అభ్యుదయ కవిత్వం విరివిగా వెలయించి బహుళంగా ప్రచారం చేస్తున్నారు.

సమాజాన్ని చీడలా పట్టివీడునున్న క్షీణ సంస్కృతిని తమ సాయ శక్తులా అన్ని దశల్లోనూ ఖండిస్తూనే ఉన్నారు.

ఇదంతా అభ్యుదయ సాహిత్య చరిత్ర చెబుతున్న అక్షర సత్యమేకానీ అభూత కల్పనకాదు.

ఈ నేపథ్యంలో ఇటీవల పుంఖాను పుంఖాలుగా వస్తున్న వచన కవితా సంపుటాల్లో అభ్యుదయ సువాసనలు కలిగిన కొన్ని వచన కవితల్ని పరిశీలిస్తే యువకవులు సమాజం పట్ల బాధ్యతాయుతమైన, నిబద్ధత కలిగిన కవితలు వెలయిస్తున్నారన్న సత్యం విదితమౌతుంది.

అక్షరాల్ని ఆయుధాలుగా మార్చి అభ్యుదయ కవిత్వాన్ని స్వాగతించి శుభాకాంక్షలు చెపుతూ మినీ, మేక్సీ కవితల్ని కుడి, ఎడమలుగా సంధించిన యువకవి అశోక్‌కుమార్ ఇటీవల కాలంలో కొత్త ప్రయోగాలు విరివిగా చేస్తున్నారు. భ్రష్టు పట్టిపోతున్న భారతీయ సంస్కృతిని "కొత్త సుందరి"గా అభివర్ణిస్తూ ఒక కవితలో ఇలా అంటారు.

"కొత్త సుందరి
కంటినీ పంటినీ
కొవ్వని తుంటినీ
లోతైన నాభి గుంటనీ
గానం చేస్తున్నారు

గానానికి ప్రాణం పోస్తున్నారు"
అలాగే మరొక కవితలో
"పిటపిటలాడే ఈ కటిమీద
నల్లటి చారికలు
ఎర్రని చీరికలు
ఏ చీకటి వ్యాపార వ్యవహారాలకు
సర్కారు వారు అమర్చిన
పర్మిట్ల పరిచారికలని చెప్పను?

ఈ కవితలో కొత్త సుందరి ఎవరో? లోతైన నాభి గుంటని గురించి గానం చేసేది ఎవరో? ఆ సుందరాంగులను అంగడి వస్తువుని చేసి వ్యాపారం సాగించేది ఎవరో? ఆ చీకటి వ్యాపారాలకి సర్కారు వారు పెర్మిట్లు ఏవిధంగా జారీ చేశారో? అన్న ప్రశ్నల పరంపర వేస్తూనే కవి వీటిలోనే సమాధానాలు కూడా నిక్షిప్తంచేసి పాఠకుడికి అందించారు. ఉత్తమోత్తమమైన భారతీయ సంస్కృతి ఏ విధంగా దిగజారిపోతోందో ఆ నాల్గు లైన్లలోనే వివరించి పాఠకుడ్ని ఆలోచనల్లో ముంచెత్తేలా చేశారు. అశోక్‌కుమార్.

అహోరాత్రులు దూరదర్శినిలో వస్తున్న అశ్లీల భూతుపంచాంగ శ్రవణం దృశ్యరూపంలో యువతని తప్పుదారి పట్టించి ఎలా మత్తెక్కిస్తోందో స్పష్టంగా చూపారు. అలాగే భారతీయ సంస్కృతీ సంస్కారాలూ, అంతర్ధానమైపోతున్న విషాద వివర్ణ దృశ్యాలూ, కవిత్వంలోకి తర్జుమా చేసిన సుశీల గారి 'పడమటి గాలి' కవితాసంపుటిలో అనేక కవితలు పాఠకుల అంతరంగాల్ని స్పృశిస్తాయి. వారే ఒక కవితలో

"నిద్రలేని రాత్రిళ్లలో
నిద్రచాలని రాత్రిళ్లలో
ఎన్నెన్నో కలలు
కల్లలైపోతుంటే
దిక్కుతోచని చిన్నారి చేతిలో
నైలాన్ తాడు" అని అంటారు.

ఈ చిన్నారి ఒక కార్పొరేట్ సంస్థలో పేరెంట్స్ బలవంతంతో చదువుకొనే విద్యార్థి అని, ఆమె డాలర్స్ పండించేశక్తి లేక నైలాన్ తాడుతో తన గదినే ఉరికంబంగా చేసుకుందని పాఠకుడికి ఏ విమర్శకుడి సాయం అక్కరలేకుండా అవగతమై పోతుంది. ఒక విషాద దృశ్యం కంటిముందు కదలాడుతుంది. అలాగే మరో కవితలో

'వరవట్నపు బాధలు
వృద్ధకన్యల ఆత్మహత్యలు
తీయటి విషంలాంటి సతీసహగమనం
వంటింటి కుందేళ్ళు
కిరసనాయిల్ హత్యలు
మత కలహాలు
అయోధ్య పరిణామాలు
ఎలామర్చిపోగలం
ఈ పైశాచికత్వాన్ని"

అంటూ సమాజాన్ని సూటిగా ప్రశ్నిస్తారు. వరకట్న హోమంలో కిరసనాయల్ పాత్రని మార్మికంగా విశదీకరించారు సుశీలగారు.

మఖ్దూం, ఫైజ్, సర్దార్ జఫ్రీ, కైఫీ అజ్మీ, లాంటి మహాకవుల ప్రగతిశీల భావాల్ని పుణికి పుచ్చుకున్న వినుకొండ యువకవి కరీముల్లా అనకొండ లాంటి సామ్రాజ్యవాదాన్ని నిరసిస్తూ వ్రాసిన కవితలో

"రవి అస్తమించని సామ్రాజ్యాన్ని
దప్పుకొట్టే తెల్లకాకి
నీ మురికి కంపు బార్లా తెరుచుకుంది
ఏడు తరాల్ని మింగినా నీ వలసవాదం
మళ్ళీరెట్ట వేస్తూనేవుంది" అని ఎలుగెత్తి

ఐక్యపోరాటానికి పిలుపుఇస్తారు. ఏడుతరాల కథని గుర్తుచేస్తూ నీగ్రోజాతిని అమానుషంగా కుక్కలతో కరిపించి, హింసించిన విషాద దృశ్యాన్ని పాఠకులకు గుర్తుచేస్తారు. అలాగే కరీముల్లా మరో కవితలో...

"కల్తీ ముందు మట్టిని మింగేసినపుడు
ఊరవతల శవాల్ని
డాలర్లకు నైవేధ్యం చేసే
రూపాయి ప్రకటించే ఎక్స్‌గ్రేషియా
బొందల్ని జన్నత్ మారుస్తుంది." అని అంటారు.

పంటచేను దగ్గర పడివున్న శవాల్ని వాటివెనక విన్పించే విషాద షెహనాయి నాదాన్ని అక్షరాలుగా మార్చి 'నిషిద్ధ గీతం' గా విన్పించిన కరీముల్లా అభ్యుదయ కవులకు ప్రతినిధిగా నిలబడతాడు.

నేటి సమాజం ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ లాంటి పాశ్చాత్య ప్రభావాలతో అతలా కుతలం అవుతోంది. బహుళజాతి కంపెనీలు భారతదేశంలో ఆధిపత్యం వహిస్తున్నాయి. కంప్యూటర్ల కోర్సులలో శిక్షణ పొందిన యువత ఉద్యోగాలకోసం, అమెరికా ఇతర పశ్చిమ దేశాలకి వలసపోతున్నారు. ఆయా దేశాలలో పగలు మనకి రాత్రి అవుతుంది. మనరాత్రి వారికి పగలవుతుంది. అక్కడి వారంతా తమ పగటి వేళల్లోనే ఉద్యోగాలు నిర్వహించుకుంటూ ఇక్కడ మనవారి చేత రాత్రివేళల్లో పని చేయిస్తున్నారు. ఈ హైటెక్ ఉద్యోగాల వల్ల ఇక్కడ మనవారి దాంపత్య జీవితాలు భగ్నమౌతున్నాయి. ఇక్కడి వారి ఆరోగ్యాలు దెబ్బతింటున్నాయి. యువకవులు ఈ రకం సంక్లిష్టతల మీద తమ దృష్టి సారించవలసివుంది.

సమాజంలో పొగలా అలుముకుపోతున్న ఎలక్ట్రానిక్ పరికరాల ప్రభావం, సెల్‌ఫోన్లు, ఫేషన్ పెరేడ్లు, బానిసత్వంలో ముంచెత్తి మన మూలాలు పెకిలించి వేస్తున్నాయి. ఇలాంటి హైటెక్ కల్చర్ దుష్ప్రభావాలు నిరసించడానికి హైపోటెన్సీలో సాంద్రతరమైన ఎంత కవిత్వం ఎంతమంది వ్రాస్తే నిరోధించబడుతుంది? ఈ భ్రష్ట సంస్కృతి ఎన్ని కవితాయుధాలు ఝుళిపిస్తే ఆగుతుంది? యువ సాహిత్యకారులందరూ ఈ విషయమై తీవ్రంగా ఆలోచించవలసి వుంది. ఈ తరుణంలో అభ్యుదయ కవిత్వం వెలయించడం ప్రథమ కర్తవ్యంగానూ బాధ్యత గానూ యువకవులందరూ స్వీకరించవలసి వుంది. ఇది ఒక ఉద్యమరూపం దాల్చివలసివుంది. ★

# దాచుకోగల చోటు

బ్యాంకు లాకరు
పొదుపు ఖాతాపుస్తకం
చెక్కుల పుస్తకం
ఎ.టి.ఎం. యంత్రం
సాంప్రదాయక త్రిజోరీ
దాచుకోగల చోటు కాదు
నిజమైన దాచుకోగల చోటౌకటుంది
అది అపురూపం
అద్భుతం
శ్రమైక జీవన సౌందర్యానికి మాత్రమే
కనిపించే చోటది.
నివసించే చోటది.
కట్లపాములు
రక్తపింజరలు
కోబ్రాలు రాలేని చోటది.
ఉండలేని చోటది.
చరిత్రకొక చరిత్ర ఉందని చాటే చోటు.
ఆలోచనను మెరిపించే మెదడు
బిందువు
పదార్థ విశ్వరూపానికి అంతఃకేంద్రం
విశ్వవిశ్వాంతరాళ భ్రమణబిందువు
దాచుకోగల చోటును
దోచుకోవటానికి
తరతరాలుగా జరుగుతుంది కుట్ర
తాత్కాలికంగా గెలుస్తున్నకుట్రను
కూకటి వేళ్లతో కూల్చే చోటు
అదే అచ్చంగా కూల్చే చోటు
సమత మమతలు నిలబడినచోటు
బోన్‌సాయి బోధివృక్షంగా మారేచోటు
మార్చే చోటు
అదేనిజమైన దాచుకోగల చోటు

– వల్లభాపురం జనార్ధన్

అనువాద కథ :
ఒరియా మూలం :
- కాళింది చరణ్ పాణిగ్రాహి
- డా॥ మానేపల్లి



# కుక్క



జాలీ, ఆల్బియన్ చిన్నప్పటినుంచీ స్నేహితులు ఎట్టి పరిస్థితుల్లోనూ వాళ్లు విడిపోరు. ఆల్బియన్ ఇంగ్లీష్ గ్రేహౌండ్, పూర్వీకులు ఇంగ్లండ్ నుంచి వచ్చారు. జాలీ ఒరియా దేశానికి చెందిన దేశవాళీ జాతి. ఆల్బియన్ పూర్తిగా మాంసాహారి జాలీ శాఖాహారి.

జాలీకి జబ్బుచేసింది. పగలూ రాత్రే ఆల్బియన్ దాని ప్రక్కనేవుండి కాపలా కాసింది. అక్కడే ఆహారం ఏర్పాటుచేసింది. ఆల్బియన్‌కి ఒకసారి కాలు విరిగింది. జాలీకి ఆల్బియన్‌కు గల అపార బలం తెలుసు. దెబ్బఎలా తగిలిందో తెలీలేదు. చాలా కాలం. జాలీ తనకు గల ప్రేమనంతా ఆల్బియన్ మీద చూపించింది. క్రమంగా అల్బియన్ కోలుకుంది. యధాప్రకారంగా లేచి తిరగడం ప్రారంభించింది. వసంతకాలం వచ్చింది. జమిందారుకు ఈ రెండు కుక్కలంటే చాలాయిష్టం. పగలంతా పనులు పూర్తిచేసుకుని సాయంత్రానికి ఇంటిముందు ఖాళీమైదానంలో తిరుగుతుంటే కుక్కలు అతని ముందు ఆటలాడుకొంటై. జాలీ ఆయనకాళ్లు నాకుతుంది. కాళ్లసందులోంచి దూరి ఆటలాడుతుంది.

ఇతర కుక్కలు కనిపిస్తే, జాలీ వెనక్కి వెనక్కి జంకి జమిందారువెనుక నక్కుతుంది. ఆల్బియన్ దెబ్బలాటకు వెళుతుంది. దాంతో ఆకుక్కలు తోక ముడుచుకొని పారిపోతాయి.

జమిందారుకి ఒక కూతురుంది. ఆ అమ్మాయి ఎప్పుడూ ఈ కుక్కతోనే వుంటుంది. ఆమెకూడ ఆయాకూడా వుంటుంది. కుక్కలు రెండూ ఆ అమ్మాయితో సంతోషంగా ఆడుకుంటాయి.

జమిందారు పడకకుర్చీలో కూర్చుని ఆ దృశ్యం సంతోషంగా చూస్తుంటాడు. ఆయన చాలా ఆధునికంగా వుంటాడు అన్ని విషయాల్లోనూ. ఊళ్లో వాళ్లతో పైజామా లాల్చీలో వుంటాడు. ఇంగ్లీషు దొరల్తో మాట్లాడేటప్పుడు సూటు, బూటూ వేసుకుంటాడు. దొరలు సెలవుల్లో వేటకు అతని ఎస్టేటులోకి వస్తుంటారు. వాళ్లకోసం అన్ని సౌకర్యాలతో ఒక అతిధిగృహం ఎప్పుడూ సిద్ధంగా వుంటుంది. ఆయనవన్నీ ఇంగ్లీషువారల పద్ధతులు, ఆహార, విహారాదుల్లో విదేశీయం. కొందరు అతని విదేశ పద్ధతులు చూసి విసుక్కుంటుంటారు.

డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్-పాత స్నేహితుడే-క్రిస్టమస్ సెలవల్లో, కుటుంబంతో వస్తున్నానని కబురు చేశాడు. వేటంటే అతనికిష్టం అతిధిగృహం-నాలుగు రోజులు ముందుగానే - సిద్ధంచేయించాడు. కొట్టుకు పంపించి కావలసిన సామాన్లన్నీ తెప్పించాడు.

మోటారు కేసు తీసుకుని అతిధిని తోడ్కొని తేవడానికి ఎదురు వెళ్లాడు దొరగారు విచ్చేశారు. భార్యాకుమార్లతో సహా మర్నాటిఉదయం టిఫిన్లుచేసి అడవిలోకి బయలుదేరాలని నిర్ణయించు కున్నారు.

వేటాడేస్థలం-ఎస్టేటునుంచి-పద్నాలుగు మైళ్ల దూరంవుంటుంది. ఆచుట్టుపక్కల జనావాసం వుండదు. సేవకులు ఆహారం, ఇతర వస్తువులు తీసుకొని ముందుగానే వెళ్లారు. జమిందారు, డి.ఐ.జి దొరగారి రెండు వేటకుక్కలు, జమిదారుగారి పెంపుడు కుక్కలు ఆల్బియన్, జాలీ-అంతా కారులో వెళ్లారు.

క్రిస్టమస్ వేడుకలు అయిదురోజులపాటు జరిగాయి. అతిధులంతా చాలా సంతోషించారు. పట్టణంలోవుండే గోలా, దూళీలేవు - వాతావరణం తరవాత బహు ప్రశాంతంగా ఉంది. ఏర్పాట్లన్నీ చక్కగా ఉన్నాయి. ఐదోరోజు భోజనాల తరువాత జమిందారు డిఐజి దొరా వేటకి బయల్దేరారు.

ఎక్కడా వేట దొరకలేదు. పిట్టలు భయపడి ఎటో ఎగిరిపోయాయి. బాగా అడవిలోపలికి నాలుగు మైళ్లులోపలికి వెళ్లిపోయారు.

సాయంత్రమైంది. సూర్యుడు అస్తమిచాడు. ఏదన్నా దొరకదా అని తెగ వెదుకుతున్నారు.

చీకటిపడింది. వెంట వచ్చిన సేవకులు యజమానుల్ని అనురించుకుని తిరుగు తున్నారు.

స్నేహితులిద్దరూ చీకట్లో చిక్కుకున్నారు. చల్లగాలి వీసింది. వర్షం వచ్చేలావుంది. వర్షం వచ్చేలోగా నాలుగుమైళ్ళ ప్రయాణంచెయ్యడం కష్టం. తుఫాను విరుచుకుపడింది. తుపాకులు బుజాన వేసుకుని ఉరుకులు పరుగుల్తో గుడారం చేరుకున్నారు. రాత్రి ఎనిమిదయింది.

భోజనం ఏర్పాట్లు లేవు. ఒక్క పిట్టనుకూడా కొట్టలేదు. తెల్లవారేవరకూ కదిలేదారిలేదు. ఈ తుఫానులో, పోరువానలో - పద్నాలుగు మైళ్ళు వెళ్లడం అంటే మాటలుకాదు. చుట్టుప్రక్కల ఎక్కడా ఆహారం దొరికే మార్గంలేదు. దోవంతా వర్షంతో నిండిపోయింది. ఏంచెయ్యాలి? జమిందారు సేవకులమీద మండి పడి పోతున్నాడు.

ఉన్నట్టుండి దొర, నాకో ఆలోచనొచ్చింది. భోజనానికి ఒకమార్గం ఆలోచించాను- అన్నాడు.

"ఏమిటి?" అన్నాడు జమిందారు అదొకలా మొహంపెట్టి ""ఏమీ అనుకోరుగదా. బ్రహ్మాండమైన విందుకు ఏర్పాటు చేస్తాను. దానివల్ల పెద్దలోటేమీ ఉండదు. దొర ఏమంటున్నాడో జమిందారుకు బోధపడలేదు. జాలీ పేరు వినబడేసరికి అతనికి గుండెల్లో రాయిపడింది.

జాలీ అంటే జమిందారుకు చాలా యిష్టం. అపేక్ష ఇలాంటి వేట సమయంలోనే దాన్ని తెచ్చారు. అప్పటికది తల్లిదగ్గరపాలు తాగుతున్నది. జమిందారు తుపాకిగుండుకు తల్లిచచ్చిపోయింది. జాలీని చూసి జాలివేసింది. కాని ఇవ్వాళ దానిచావు చూడవలసి వస్తుందనుకోలేదు.

తానే స్వయంగా దాన్ని చంపుతానన్నాడు దొర. వనివాడు మధియని పెలిచారు. జాలీని తీసుకొస్తుంటే - ఆల్బియన్ ఊరుకోలేదు. గట్టిగా మొరగడం ప్రారంభించింది. దొర చెతిలో కత్తి దీపాల వెలుగులో తళుక్కున మెరిసింది. తుపాకు గుండు ఎందుకు అనవసరం! కత్తితో పనికానిచ్చేస్తానని ఆలోచించాడు దొర. జాలీ జాలిగా ఆల్బియన్ వేపు చూస్తోంది. ఆల్బియన్‌కు ఏదో అనుమానంగా ఉంది. దాన్ని గట్టిగా గొలుసులతో బంధించారు. కాని అది కోపంగా గుంజు కుంటున్నది. జమిందారు ఈ దృశ్యం చూడలేక లోపలికి వెళ్లిపోయాడు. అందునా మధ్య మధ్యలో భయం భయంగా చూస్తూనే వున్నాడు. మొహంమీద జేబు రుమాలు వేసుకున్నారు. ఆ అరుపు జాలీదే. రుమాలు తీసి చూశాడు. అంతా అయిపోయింది.

భోజనం బల్లదగ్గర మహావిచారంగా కూచున్నాడు. పడక గదికి వెళ్లాడుగాని నిద్రరాలేదు కంటికి.

తెల్లవారికి - బంగళాకి వచ్చేశారు. అతిధులు సంతోషంగా నిష్క్రమించారు. జమిందారు మహావిచారంలో మునికిపోయి వున్నాడు. ఒక వ్యక్తి ఆహారంకోసం ఇంకో ప్రాణం తియ్యాలా?

"ఏదీ జాలీ?" అని అరిచింది. నాలుగేళ్ల కూతురు. సరయిన సమాధానం చెప్పలేక పోయాడు. వెళ్లి కూతుర్ని ఎత్తుకుని అక్కున చేర్చుకున్నాడు. "వస్తుంది ఉంది" అన్నాడు.

ఆ పిల్ల వినలేదు "నువ్వు అబద్ధం చెబుతున్నావు ఆదొర దాన్ని చంపేశాడట కదు. మధియా చెబుతు న్నాడు, నేను దొరని చంపేస్తాను" అన్నది ఏడుస్తూ, జాలీ మాంసం అతనికళ్లముందు కదిలింది.

అతనికి వల్లమాలిన ఉష్ణంవచ్చింది. మంచం పట్టాడు రెండు వారాలపాటు ఖాయిలా పడ్డాడు. చివరికి తగ్గింది. నిజానికి-ఇది పునర్జన్మే.

నేను దొరలకోసం కట్టిన అతిధిగృహం - అనాధాశ్రమంకింద మారింది. జమిందారు ఇంట్లో మాంసాహారం పూర్తిగా నిషేదించారు. తన ఎస్టేటులో వేటకూడా ఆడకూడదని ఆజ్ఞలు జారీచేశాడు.

ఆల్బియన్ ఆహారం ముట్టడంలేదు, వెళ్లి జాలీ చచ్చిపోయిన చోట మట్టివాసన చూస్తూ కూచుంది. దాన్ని తిరిగి యింటికి తీసుకొచ్చేదు. మధియా ఎంత జాగ్రత్తగా చూసుకున్నా లాభం లేదు. ఉన్నట్టుండి ఎక్కడికో మాయమైంది.

గుడారం వేపు వెళ్లిందన్నాడు. అడవిలో కర్రలు కొట్టుకునే వాళ్లు తమకు కుక్క అరుపులు వినిపిస్తున్నాయన్నారు. ఆ అరుపులు ఎవరివి? జాలీవా ఆల్బియన్‌వా? ★

పుస్తక సమీక్ష

# పద్యానికి వన్నెలద్దిన సుబ్బన్న కావ్యం 'శ్రీ వ్యాసవిలాసం'

\- సత్రీ

పద్యం లేని తెలుగు సాహిత్యాన్ని ఊహించలేం. గొప్పగా అభివృద్ధి చెందిన సాహిత్య ప్రక్రియ 'కవిత్వం', తెలుగు కవిత్వాన్ని పతాకస్థాయికి తీసు కెళ్లిన ఘనత పద్యానిదే. తెలుగు పద్యానికి ప్రబంధ కవులు కొత్త సొబగులద్దారు. వేమన పరివర్తనాస్త్రంగా పద్యాన్ని మలిచాడు. చాటుకవులు చమత్కారాలు పలికించారు. పద్యాన్ని సామాన్యుల ముంగిట నిలిపారు అవధానులు. పండితపామర రంజకంగా సహస్ర అవధానాలు చేసిన కళాప్రపూర్ణ డా॥ సి.వి. సుబ్బన్న ఆంధ్రదేశం గర్వించదగ్గ పద్యకవి.

వయసుపైబడ్డవారి సంగీతం, నృత్యం. వెగటు పుట్టిస్తాయి కానీ సాహిత్యం మరింత పరిణతి చెందటం దాని ప్రత్యేకత. ఏడుపదులు దాటిన వయసులో శ్రమకోర్చి సుబ్బన్న శతావధాని 'శ్రీ వ్యాస విలాస ప్రబంధం' మనముందుంచారు. ఒక్క ముక్కలో ఇది నిర్వచన భారతం. మొత్తం 908 పద్యాల్లో అడుగడుగునా సుబ్బన్నగారి ప్రౌఢశైలి ఆకట్టుకుంటుంది. తెలుగు పద్యానికి వన్నెలద్దిన శ్రీ వ్యాస విలాసకర్త అభినందనీయుడు. 'ప్రబంధం' అన్నందుకైనా మరిన్ని వర్ణన ప్రధాన పద్యాలు ఉండాల్సింది. ఉదాత్తనాయకుడు, వస్తు ఐక్యత భారతరచనలో ఇమిడేవి కానందువల్ల దీన్ని "శ్రీ వ్యాసవిలాస ప్రబంధం"గా కాక "శ్రీ వ్యాస విలాసం"గా పరిగణించటమే సబబు.

చూస్తే సంధ్యాకాంతులే చూడాలి. రాస్తే భారతమే రాయాలి అని ఎందుకనిపించిందో సుబ్బన్నగారు చెబితే బావుండేది. రాసిన ముందు మాట, రాయించిన పీఠిక రెండూ దీన్లో లేవు. లోగడ తన 'శతావధాన ప్రబంధం' ఈ రచనకు మధునా పంతుల వారి అభిప్రాయం ప్రకటించారు. అలా అని పీఠికలతో పనిలేని సామాన్య రచన కాదిది. నూట ఎనభై పుటల కావ్యమిది. ఏడు ఆశ్వాసా లున్నాయి. చాలా అప్రసిద్ధ వృత్తాల్ని వాడి రాబోయే కాలంలో శతావధాని పద్యం రాయబోయే వాళ్ళకి దారి చూపించారు సుబ్బన్న శతావధాని. అంత ప్రౌఢ కవిత్వంలోనూ 'విసిగివేసారి' (102వ పేజీ - 3 వ పద్యం), 'రాజ్యముగీజ్యము' (162 వ పుట-79 వ పద్యం) లాంటి చక్కని తెలుగు పలుకు'బళ్లు' తెరిచారు. తల్లి కనుకొల్కు లొరసి ముత్యముల పోల్కి (82వ పుట 35వ పద్యం) అంటూ వందలాది పద్యాల్లో గొప్పగా భావావిష్కరణ చేసారు.

పద్య ప్రియులు చదవాల్సిన 'శ్రీ వ్యాస విలాసం' డా॥ సి.వి. సుబ్బన్న శతావధాని కళాపీఠం, పొద్దుటూరు - 516 360 నించీ పొందవచ్చు. వెల రూ. **50/-** లు మాత్రమే. ★

# శ్రీశ్రీ క్విజ్-4



## సమాధానం-సమాచారం

**1.(ఎ) ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి(1911-1987)** కవి, పండితుడు, మలి తరం భావకవి. చిన్న కథకి కథానిక అన్న పేరు అగ్నిపురాణం లోనే ఉందని వెల్లడించిందీయనే. సంస్కృత నాటకాలను అనువాదం చేశారు. 'తెలుగు వీణ' (1934), ద్రాక్షారామం(1951), ఆరుయుగాల ఆంధ్ర కవిత -కవితా సమీక్షా గ్రంథం (1986) వెలువడ్డాయి.

**2.(బి). రా.వి.శాస్త్రీయం.(1882):** రాచకొండ విశ్వనాథ శాస్త్రి మరణానంతరం ఎంతో విషయ వైవిధ్యంతో వెలువడిన రావిశాస్త్రి రచనల సంపుటి. (వ్యాసాలు, ఉపన్యాసాలు, కవితలు, ముందు మాటలు, సమీక్షలు వగైరా) మొదటి ముద్రణ 1982లో విరసం ప్రచురణగా వెలువడింది.
**శ్రీశ్రీ సమీక్ష:(ఆంధ్రజ్యోతి వారపత్రిక 01-04-83)**

**3.(సి).కష్టజీవికి :** కవి అనేవాడి బాధ్యత కష్టజీవికి రెండువైపులా నిలవడం అని చెప్తూ, కష్టజీవి పదం లోని అటూ ఇటూ ఉన్న అక్షరాలు కలిపి 'కవి'ని చేయడంఒఅద్భుతం.ఇలాంటి ఎన్నోఅద్భుతాలే శ్రీశ్రీ.
**('జాబులు-జవాబులు'-ప్రగతివారపత్రిక..6-6-69)**

**4.(డి). చంద్ర రాజేశ్వరరావు (1915-1994) :** ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు. 1942 రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి, 1948లో కేంద్ర కమిటీ సభ్యుడు. 1964 నుండి సి.పి.ఐ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. 1974లో సోవియట్ ప్రభుత్వం లెనిన్ అవార్డు బహూకరించింది. శ్రీశ్రీ 'దేశచరిత్ర' ప్రారంభ చరణాలు నిరాశను ధ్వనిస్తున్నాయి అనే ఏటుకూరి బలరామమూర్తి వ్యాసాన్నిఖండిస్తూ చంద్రరాజేశ్వర రావు రాసిన లేఖ 29-03-52న ప్రజాశక్తిలో అచ్చయింది.
**'నాకు తెలిసి అచ్చులో శ్రీశ్రీని 'మహాకవి'గా వర్ణించడం శ్రీ రాజేశ్వరరావు గారి లేఖతో ప్రారంభమైంది'- కెవి.రమణారెడ్డి (లోక కులాయనం-శ్రీశ్రీ సాహిత్యం మూడు కావ్య విభాగం)**

**5.(ఎ). అనంతం (1986)** 'అనంతం' శ్రీశ్రీ స్వీయ చరిత్ర, శ్రీశ్రీ జీవిత కథ, శ్రీశ్రీ కవితా జీవితం, శ్రీశ్రీ జీవిత కావ్యం. ఆత్మచరిత్రాత్మ చరిత్రాత్మక నవల. శ్రీశ్రీసాహిత్య సర్వస్వం-20 గా86లో వెలు వడింది. చాలావరకు ప్రజాతంత్రవారపత్రిక లోనూ (75-77), స్వాతిమాసపత్రికలోనూ (79-80) రాశారు.

**6.(బి).మిరియాల రామకృష్ణ (1934-2004):** ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ సభ్యులుగా ఉన్నారు. చిన్న పిల్లల కోసం రాసిన గేయాలు, కథలు పుస్తకాలుగా వెలెవడ్డాయి.'శ్రీశ్రీ కవిత్వం: వస్తువు-సంవిధానం'(1980) థీసిస్ తో డాక్టరేట్ పొందారు.

**7.(సి).ఊగరా!ఊగరా!!** ఈగేయాన్ని1971లో రాశారు 'తుది పయనం:తొలి విజయం'శీర్షిక.'మరో ప్రస్థానం'(80)కావ్యంలో చోటుచేసుకుంది స్వతహాగా శ్రీశ్రీగాయకుడు కాకపోయినా ఈ గేయాన్ని మహోద్రేకంతో ఊగిపోతూ పాడేవాడు.బహిరంగ వేదికలపై శ్రీశ్రీపాడుతుంటే జనం వెర్రెత్తి పోయేవారు.

**10.(డి).సి.వి (1936-)** సి.వి, సి.విజయలక్ష్మి, అరుణశ్రీ, కలం పేర్లు. పూర్తి పేరు చిత్తజల్లు వరహాల రావు.దిగంబర కవులకన్నా ముందుగానే వ్యవస్థమీద కసితో కవిత్వం రాశారు.హేతువాద స్ఫూర్తితో నరబలి,ఊళ్లోకి స్వాములారు వేంచేశారు.సత్య కామ జాబాలి కావ్యాలు రాశారు.విషాద భారతం, కారు చీకట్లోకాంతిరేఖ, పారిస్‌కమ్యూన్ ఇతర రచనలు

**9.(ఎ). పురిపండా అప్పలస్వామి(1904-1982)** కవి, పత్రికా సంపాదకుడు. శ్రీరంగం శ్రీనివాసరావు తొలిపద్యాలను తన పత్రిక 'స్వశక్తి'లో 'దివ్య లోచనములు' పేరుతో అచ్చువేశారు. వ్యవహారిక భాషాభిమాని. గిడుగు అనుంగు శిష్యుడు. అయన రచనలలో 'పులిపంజా' ప్రసిద్ధమైంది.

**10.(బి).విరసం (04-07-1970):** నక్సల్‌బరీ శ్రీకాకుళపోరాటాల ప్రేరణతో పుట్టిన రచయితల సంఘం. బూర్జువా సంస్కృతికి వ్యతిరేకంగా శ్రామిక సంస్కృతిని నిలబెట్టడానికి కృషి చేస్తున్న సాహిత్య సంస్థ. శ్రీశ్రీ దీనికి సంస్థాపక అధ్యక్షులు.
**'ఇండియాకు రాష్ట్రపతి కావడంకన్నా, విరసం అధ్యక్షుణ్ణి కావడమే నాకు మహదానందకరం'- శ్రీశ్రీ**
('యువ భారతి' సమీక్షావ్యాససంకలనం'మహతి'-1972)

✳✳✳✳

ఆల్ కరెక్ట్‌గా రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ కింది ఐదుగురికి, ఆరు నెలల పాటు 'చినుకు'.బహుమతిగా పంపబడుతుంది.

1.శ్రీ. ఎస్. హనుమంతరావు..హైదరాబాద్
2.శ్రీ.ఎస్. చైతన్య..రాజమండ్రి
3.శ్రీమతి బి. రత్నమాల..జంగారెడ్డిగూడెం
4.శ్రీమతి టి. రాజేశ్వరి..అనంతపురం
5.శ్రీ. ఎన్. వెంకటేశ్వరరావు..హైదరాబాద్



# శ్రీశ్రీ క్విజ్-5



**నిర్వహణ : అశోక్ కుమార్**



1.శ్రీశ్రీ మరోఐదుగురు కలిసి రాసిన తెలుగులో మొదటి గొలుసుకట్టు నవల ఏది?
ఎ. ఆదర్శ జీవులు బి.పరిణయ రహస్యం
సి. అమ్మా ! డి. సంపెంగతోట

2. చాలా క్రూరుడైన విమర్శకుడు 'అన్ కైండెస్ట్ క్రిటిక్' అని శ్రీశ్రీ ఎవరిని అన్నారు.?
ఎ. చలం బి. రా.రా
సి. కొడవటిగంటి డి. త్రిపురనేని మధుసూదనరావు



3. శ్రీశ్రీ అనువదించిన 'లెనిన్ కావ్యం' రాసిన రష్యన్ రచయిత?
ఎ. చార్లెస్ డికెన్సు బి.లూయీ ఆరగాన్
సి. మయకోవస్కీ డి. గోర్కీ



4. శ్రీశ్రీ 'నవకవిత' గేయంలోని పాదాలను తీసుకుని కథలుగా రాసిన రచయిత ?
ఎ. బి. సి.యస్.రావు బి. అర్నాద్
సి. డి. వెంకటరామయ్య డి. రామవరపు వేణుగోపాల్

5. అచ్చులో శ్రీశ్రీ తొలి గ్రంథం?
ఎ. పరిణయ రహస్యం. బి. చరమ రాత్రి
సి. మహా ప్రస్థానం డి. ప్రభవ



6. శ్రీశ్రీ సొంత దస్తూరి, సొంతగొంతుకతో లండన్‌లో ప్రచురింపబడ్డ గంథం?
ఎ. ఖడ్గసృష్టి బి. మహా ప్రస్థానం
సి. మరో ప్రస్థానం డి. సిప్రాలి



7.మార్క్స్ ప్రధాన లక్షణం ఏకాగ్రత ! మరి శ్రీశ్రీ తనే చెప్పుకున్న తన లక్షణం ?
ఎ. మహా ఏకాగ్రత బి. మహోగ్రత
సి. అనేకాగ్రత డి. మరో ఏకాగ్రత

8.లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మానిఫెస్టో ఉత్తేజంతో శ్రీశ్రీ రాసిన గేయం ?
ఎ. దేశచరిత్రలు బి. వాడు
సి. మహా ప్రస్థానం డి. ప్రతిజ్ఞ



9. శ్రీశ్రీ మహాప్రస్థానంకు ముందుమాట చలంతో రాయించిన రచయిత ఎవరు?
ఎ. జలసూత్రం రుక్మీనాథ శాస్త్రి బి. నళినీకుమార్
సి. అబ్బూరి రామకృష్ణారావు డి. పురిపండా అప్పలస్వామి



10.'కవిత్వం ఒక అల్కెమి. దాని రహస్యం కవికే తెలుసు/ కాళిదాసుకు తెలుసు, పెద్దన్నకి తెలుసు/ కృష్ణశాస్త్రికి తెలుసు / శ్రీశ్రీకి తెలుసు' అన్న అభ్యుదయ కవి?
ఎ. కుందుర్తి బి. తిలక్
సి. పఠాభి డి. అజంతా

సరైన సమాధానాలు రాసి 25-08-2005 లోగా పంపినవారిలో ఐదుగురిని డ్రా ద్వారా ఎంపిక చేసి ఒక్కొక్కరికి అర్ధ సంవత్సర కాలం **'చినుకు'** - మాస పత్రిక బహుమతిగా పంపబడుతుంది.



TOPCON MICROSCOPE



OPHTHALMIC CHAIR UNIT

## ఇచ్చట గల వైద్య సదుపాయములు

1. కంప్యూటరైజ్డ్ ఆటో రిఫ్రాక్టర్ :-
ఈ పరికరము వలన కంట్లో చుక్కల మందు వేయకుండానే ఖచ్చితమైన, త్వరితమైన కంటి పరీక్షచేసి కంటి అద్దములు ఇవ్వవచ్చు.
2. కాంటాక్ట్‌లెన్స్‌లు అమర్చబడును.
3. అన్ని రకముల శుక్లాల ఆపరేషన్స్ చేయబడును.
ఆపరేషన్ అయిన వెంటనే రోగి ఇంటికి వెళ్ళిపోవచ్చు.
ఎ) S.I.C.S. (ఎస్.ఐ.సి.ఎస్.) కుట్లు లేకుండ శుక్లం తీసి, లెన్సు (ఐ.ఓ.ఎల్) అమర్చబడును.
బి) ఫాకో - సూది ద్వారా కుట్లు లేకుండ శుక్లం తీసి నూతన తరహా Foldable(ఫోల్డబుల్) లెన్సు అమర్చబడును.
4. రక్తపోటు, షుగరు ప్రభావం వలన, కంటిలోపలి పొరలో (రెటీనా)వచ్చు వ్యాధుల నిర్ధారణ :- బయోమైక్రోస్కోపీ, ఇండైరెక్ట్ ఆఫ్తాల్మోస్కోపీలతో.
5. నీటి కాసుల వ్యాధి నిర్ధారణ :-
గొనియోస్కోపీ, అప్లనేషన్ టోనోమెట్రీ, డిస్క్ ఇవాల్యుయేషన్‌ల ద్వారా.



ALCON U - II PHACO-MACHINE



ECHO RULE II A-SCAN



GONIO SCOPE & LENSES



INDIRECT OPHTHALMOSCOPE



SLIT LAMP & AUTO REFRACTOR




**Dr. S. PRAVEEN**
M.S., (Ophthal)
Ex-Fellow Antenor Segment & I O L Surgery (long-term)
Ex-Fellow Diabetic Retinopathy & Lasers (short-term)
Aravind Eye Hospital, Madhurai

# ఉదయ నేత్ర వైద్యశాల

బెల్లపు శోభనాద్రిరోడ్, పుష్పాహోటల్‌దగ్గర, కస్తూరిబాయిపేట సెంటర్,
సూర్యారావుపేట, విజయవాడ - 520 002. ఫోన్: 0866-2441221

Postal Reg. No. H/VJA/105/05-07
RNI No. APTEL / 2005/14660 CHINUKU AUG 2005





Printed, Published and Owned by NANDURI RAJAGOPALA RAO, V.V.S. and Printed at VANAJA OFFSET PRINTERS # 32-21-18A, Seataramapuram VIJAYAWADA -4.
Published at 27,28 III rd Floor, Datta's Nayabazaar, Opp Raj Yuvaraj Theaters, Gandhinagar, VIJAYAWADA -3.
Editor NANDURI RAJA GOPALA RAO, VVS

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101M109 |
| పుస్తకం పేరు | చినుకు |
| తారీఖు | 14 March 2025 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jagamma |
| పేజీలు విడదీసినది | P. Jagamma |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |